ఓమ్

# శ్రీ నిర్వాణ నిలయము

ఇది

శ్రీ సద్గురు మలయాళస్వాములవారిచే విరచితము.



మొదటి కూర్పు 1000 ప్రతులు.

---

శ్రీ వేదాన్త ముద్రాక్షరశాల, ఏర్పేడు.

దీని వెల]   1948   [ రూ. 2—0—0

వలయువారికి విలాసము:—

శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు పోస్టు, చిత్తూరుజిల్లా.

అని వ్రాసిన బడయుగలరు.

అయం సోఽహమిదం తన్న

ఇతి నిస్స్నేహదీపవత్।




శాన్తే పరమ నిర్వాణే

ప్రబోధాత్ప్రతిశిష్యతి॥

ఓమ్

# మహావాక్యములు.

నాసమాన సహాయేషు నివసేద్యోగవిత్క్వచిత్।
వసేత్సమానశీలేషు సుశీలేషు తపస్విషు॥

సాధకుడగువాడు తన సమానగుణము లేని స్థలములలో ఒకప్పుడైనను నివసింపరాదు. తన సమానస్వభావమును, తపస్సును, మంచి శీలమును గల స్థలము లోనే నివసించవలెను.

ముహూర్తమపినాసీత దేశే సోపద్రవే యతిః।
ఉపద్రుతేతు మనసి సమాధిర్నైవ జాయతే॥

ఒక నిమిషమైనను యోగి ఉపద్రవములగల స్థలములలో బ్రహ్మనిష్ఠ నుండరాదు. ఏలన్నను ఉపద్రవస్థలములలో యుండిన మనస్సు సమాధి నందుట అసాధ్యము కాదా.

యదుహవా ఆత్మసమ్మితమన్నం తదవతి తన్న హినస్తి।
యద్భూయో హినస్తి తద్యత్కనీయో న తదవతి॥

ఎంత ఆహారము దేహమునకు సరిపోవునో అంత అన్నము తినుట ధర్మము. కావలసిన దానికంటె అధికముగా తిను అన్నము దేహమునకు కీడు గలుగజేయును. కావలసినదానికంటె తక్కువగా తిను అన్నము దేహమును సంరక్షింపలేదు. మితాన్నము దేహమును సంరక్షించును. అమితాన్నము దేహమును భక్షించును. మితాన్నము అమృతమై దేహమును పోషించును; అమితాన్నము విషమై దేహమును రోగయుక్త మొనర్చును.

అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా।
మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్।
మనః కనిష్ఠో భాగస్స్యాత్తస్మాదన్నమయం వపుః॥

జీవులు భుజించిన అన్నము జఠరాగ్నిచే మూడుభాగములై మారును. స్థూల భాగము మలమూత్రములుగాను, మధ్యమభాగము రక్త మాంసములుగాను మారును; కనిష్ఠభాగము మనస్సుగ పరిణమించును. అందుచేత నెవ్వడు భుజించిన అన్నమే స్థూల సూక్ష్మ శరీరములై పరిణమించును. అన్న సాత్త్వికతో మనస్సు కూడా అట్టిదియే యగును.

ఓమ్ తత్ సత్.

ఓం నమో నారాయణాయ

ఓమ్

# నిర్వాణనిలయము.

ఈ పవిత్ర గ్రంథమును అచ్చువేయుటకు, విభరాంపట్నం నివాసులగు అడుసుమిల్లి హైకోర్టు బారిష్టరు శ్రీమాన్ లక్ష్మయ్యగారి ధర్మపత్నిగారగు శ్రీమతి అడుసుమిల్లి యశోదమ్మగారు ధనమిచ్చి శుద్ధముగా ముద్రింపించి శ్రీ సద్గురుస్వాములవారి దివ్య పాదసన్నిధిలో సమర్పించిరి. వీర్లను దయామయుడగు సర్వేశ్వరుడును, లోకపావనతత్పరులగు మహర్షులును కరుణాతో అనుగ్రహించి భక్తి, జ్ఞాన, వైరాగ్య, సౌఖ్యముల నొసంగుదురుగాక.

తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం సురాలయం।
ఆరామ కృతి సత్రాణి సప్తసన్తానసంజ్ఞకాః॥

తా॥ మహర్షులు, జనులు తరించుటకొరకు ఏడువిధములగు సన్తానములను నిర్ణయించిరి. వీనిలో ఒకకార్యము చేసినవారికి ఒక సత్సంతానము గల్గినటులున్ను, అలాగున ఎన్నికార్యములు జేసిన అన్ని యుత్తమ సంతతులు గలిగినటుల తెలిసికొనవలయును. ఈ శాస్త్రసారమెఱింగిన సంతానములేదని తలంచితలంచి తపించెడు స్త్రీ పురుషులకు ఆత్మశాంతియు, ఉత్తమ సౌఖ్యమున్ను, స్వర్గ ప్రాప్తియున్ను గల్గును. ఆ సప్తసంతానములెవ్వియనగా:-

1. కోనేరు త్రవ్వించుట, 2. శాశ్వతముగా ధర్మకార్యములు జరుగుటకు ఫండు ఏర్పాటుజేయుట, 3. బ్రహ్మనిష్ఠులుండుటకు ఆశ్రమ గృహాదులను నిర్మించుట, 4. దేవాలయములు కట్టించుట, 5. పరోపకారార్థముగా వనములవేయించుట, 6. ఉత్కృష్ట గ్రంథముల అచ్చువేయించుట, 7. అన్నసత్రములను నిర్మించుట.

మన శ్రీమతి అడుసుమిల్లి యశోదమ్మగారు యిట్టిపావన కార్యమొనర్చి తనజన్మమును సాఫల్యమొనర్చుకొన్నారు.

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు.

ఓమ్ తత్ సత్.

# విషయ సూచిక.

ఓం నమో నారాయణాయ

ఓమ్.

# పీఠిక.

ఓ ప్రాజ్ఞులారా! ఈ గ్రంథము పరమనిర్వాణస్థితిలోయుండు మహానీయాత్ముల గుఱించినదగుటచే అట్టిస్థితిలోనుండువారెటుల యుండవలయునో, అది దీనివలన తేటతెల్లమగును. కావుననే దీనికి నిర్వాణనిలయమని నామకరణము చేయఁబడినది. నిర్వాణమనియు, నిర్వికల్పసమాధియనియు, బ్రహ్మసాక్షాత్కారమనియు, అమనస్కమనియు, పరిపూర్ణమనియు, జీవన్ముక్తియనియు, విదేహముక్తియనియు, ఆత్మసాక్షాత్కారమనియు చెప్పఁబడునన్నియు ఒక పర్యాయపదములని శాస్త్రము నిర్ణయించుచున్నది.

హఠయోగప్రదీపికను చూడుడు.

శ్లో॥ రాజయోగః సమాధిశ్చ ఉన్మనీచ మనోన్మనీ।
అమరత్వం లయస్తత్త్వం శూన్యాశూన్యం పరంపదమ్।

శ్లో॥ అమనస్కం తథాఽద్వైతం నిరాలమ్బం నిరంజనమ్।
జీవన్ముక్తిశ్చ సహజా తుర్యాచేత్యేకవాచకాః॥

తా॥ 1. రాజయోగము, 2. సమాధి, 3. ఉన్మని, 4. మనోన్మని, 5. అమరత్వము, 6. లయము, 7. తత్త్వము, 8. శూన్యాశూన్యము, 9. పరమపదము, 10. అమనస్కము, 11. అద్వైతము, 12. నిరాలమ్బము, 13. నిరంజనము, 14. జీవన్ముక్తి, 15. సహజము, 16. తుర్యము, అను యీ పదునారు ఒక బ్రహ్మసాక్షాత్కారము అనే నిర్వాణమునకే, నిర్వికల్పమునకే పేర్లు.

## సమాధి లక్షణము.

శ్లో॥ సలిలే సైన్ధవం యద్వత్సామ్యం భవతి యోగతః।
తథాచ మనసోఽైక్యం సమాధిరభిధీయతే॥

శ్లో॥ యదాసంక్షీయతే ప్రాణో మానసంచ ప్రలీయతే।
తదా సమరసత్వంచ సమాధిరభిధీయతే।

శ్లో॥ తత్సమంచద్వయోరైక్యం జీవాత్మపరమాత్మనోః।
ప్రనష్టసర్వసంకల్పస్సమాధిస్సోఽభిధీయతే॥

తా॥ ఎట్లు జలమునందు లవణముచేరుటవలన జలముయొక్క సామ్యమును, అనగా నైక్యమును పొందుచున్నదో, అట్లు ఆత్మకును, మనస్సునకును, గలుగునట్టి యైక్యము సమాధియనఁబడును. ఎప్పుడు ప్రాణము లయము జెంది మనస్సున్ను అణగుచున్నదో, అప్పుడు గలుగు సమరసత్వము సమాధియనఁబడును. జీవాత్మ పరమాత్మల నెడి రెంటియొక్క యైక్యమగు సంబంధముగల్గి సకలసంకల్పములును నశించుటయు సమాధియనఁబడును. ఈపర్యాయశబ్దములన్నియు, ఇది ఉదకము, జలము, తోయము, వారి అని ఒకే జలమునకు ఎన్నియోపేర్లుగలవో, అదేరీతిగ యుండునని గ్రహించుకొనవలయు. ఐతే పేర్లు మాత్రము వేరువేరుగా యుండినను స్వచ్ఛమగు జలముమాత్రమేలాగున యుండవలయునో, ఆలాగున యీ జీవన్ముక్తి స్థితియు అందరికిని ఒకే విధముగానే యుండవలయును. ఈ పేర్లు అన్నియు ఒక్కొక్క సంప్రదాయ సంబంధ నామములేగాని మఱి యొకటికాదు. ఎట్లన జలమనియు, నీళ్ళనియు, పానియనియు, తణ్ణియనియు, వెళ్ళమనియు, నీరనియు, వారియనియు, వత్తియనియు, ఒక్కొక్క భాషలో నామధేయములు వేరువేరుగాయుండినను, జలమొక్కటియే అగునట్లున్ను అట్టి నిర్వాణస్థితిలో ప్రాకృతగుణములు రహితములై యుండును. అట్టిమహాత్మునియందు ప్రాకృతగుణములుగాని, ప్రకృతి స్వభావములుగాని, ప్రకృతి వాసనలుగాని యుండరాదు. అదియే దీని యొక్క నిర్ణయము. అట్లుగాక ప్రాకృతగుణములుండిన అట్టియాత్మ ఇకను ముక్తిని పొందలేదనియే గ్రహించుకొనవలయు. "యథా భర్జితబీజస్య" అనియు, "వాసనాతృణపావకః" అనియు, "పరిపక్వఫలమివ" అనియు, "యథామధు" అనియు, "యథామృత" అనియు శాస్త్రములు దృష్టాంతము తెలుపుటకు కారణము. అనగా, 1. వేగిన వి త్తనముంకురింప నట్లున్ను, 2. విషయవాసనయగు శుష్కతృణమునకు ప్రజ్వలించెడుఅగ్ని వంటిదనియు, 3. బాగుగాపండిన మామిడిపండ్లు యేలాగున మధుర మయములై యుండునో, 4. తేనె యేలాగు అంతటా తీపిగా యుండునో, 5. అమృతమేలాగున మధురరసమై యుండునో, ఆలాగున యుండుననియు శాస్త్రము తెలుపుటకు కారణము. ఈ పదములన్నిటికి ఈగ్రంథములో ప్రమాణశ్లోకములుగలవు. అచ్చట చూచుకొనవచ్చును.

ఇకను స్ఫుటముచేసిన బంగారమువలెను, నిరావరణ సూర్యచంద్రాదులవలెను, శుభ్రముగా యుతికిన తెల్లవస్త్రమువలెను, అగ్నిదగ్ధపాశము వలెను, మూలికచే స్ఫుటమొనరించిన తామ్రము స్వర్ణమగునట్టుల యుండుననియు దృష్టాంతములుచూపుటకు కారణమయినది. దీనికి సంబంధించిన శాస్త్రములుగూడ యీగ్రంథమందు చూడందగును. అలాగున మూడుగుణములకు అతీతమగుటవల్లనే ఆత్మ, గుణత్రయరహితమగుననియు యుపదేశించుటకు కారణము. ఇట్టి స్వచ్ఛతస్థితి లేనికారణమువల్లనే సాధువులపై, సాధుస్త్రీలపై, సన్న్యాసులపై, సన్న్యాసినులపై, యోగులపై, యోగినులపై, తాపసులపై, తపస్వినులపై భక్తులపై, భక్తురాండ్రులపై, విద్వాంసులపై, విదుషీమణులపై జనులకు విశ్వాసము లేకపోవుటకు కారణము. దీనివల్ల విద్యావంతులకున్ను, గౌరవనీయులకున్ను, ప్రజ్ఞావంతులకున్ను, భూపాలురకున్ను పై జెప్పిన వార్లపై విశ్వాసములేకపోవుటచే, బ్రహ్మవిద్యలో వారికి ప్రవేశములేకపోవుటకు కారణము. దీనివల్ల పై జెప్పినగృహస్థజనులు తరింపకపోవుటయే గాక, తరణాసక్తిగల సత్సహాయులయొక్క అనుష్ఠానమునకున్ను, విద్యాభ్యాసమునకున్ను సహాయముకూడ చేయకపోవుచున్నారు. ఇది లోకమునకెంత పతనహేతువో ప్రజ్ఞావంతులు తెలిసికొందురుగాక. కావున, యీదురవస్థయగు దుష్టపిశాచము భారతదేశమునుండి తొలగిపోవలసియుండిన, సాధువులపై, గురువులపై జనులకు విశ్వాసముగలుగవలసియుండిన, పతనమగు బ్రహ్మవిద్య మరల యుద్ధరింపబడవలసి యుండిన ప్రతిభక్తులున్ను, గురువులున్ను, సాధువులున్ను, సత్యప్రవర్తకులై, ధర్మాచరణపరులై, విషయవిరక్తులై, శుద్ధాత్మజ్ఞానముగలుగువరకు అనుష్ఠానపరులై యుండినచాలును. అప్పుడు జనులకు విశ్వాసముగలుగును. దానిచే వారున్ను తరింతురు; తరించవలయునని తలంపుగలవారికి కావలసిన సహాయముగూడ యొనర్తురు, అందువల్ల యుభయులుకూడ తరించగలరు, ఉభయలోకముగూడ యుద్ధరింపబడును. భగవత్కృప యుభయులకున్ను గల్గును. మోక్షముగూడ యుభయులున్ను పొందగలరు. ధర్మవృద్ధిబొందును, అధర్మమణగును. ఓమ్.

పాఠకలోకమునకు మఱియొక విజ్ఞాపనముగూడ చేయవలసియున్నది. అదేమనగా, ఇదివరలో వ్రాసియుండు గ్రంథములలోగల అత్యావసర ప్రమాణశ్లోకములకొన్నింటిని దీనిలోగూడ తత్తదనుగుణస్థలములలోచేర్చ వలసివచ్చెను. శాస్త్ర ప్రమాణనిరూపణలేనిగ్రంథము, సాక్ష్యములేని న్యాయస్థాన విచారణవంటిదియగును. కావుననే ఋషులున్ను, శ్రీ శంకరభగవత్పాదులు మొదలుగాగలవారందఱున్ను ఆలాగున శ్రుతిస్మృతులను నిరూపించివచ్చిరి. అయితే, కొందఱీలాగునతలంతురు. అదేమనగా, ఇదంతయు ఇతరగ్రంథములనుండి సంగ్రహించినదిగదా! అటులవేద ప్రమాణమును నిరూపింపక పోయిన దీనికి శాస్త్ర ప్రమాణమేమిగలదు? ఇది వారిష్టానుసారముగా వ్రాయడమైనదనిగూడ చెప్పుదురు. అయితే ఇది పండితస్వభావముకాదు. పామరవాక్యమని విజ్ఞులెఱింగియే యున్నారు. విజ్ఞులు రాజహంసమువలె సారగ్రాహులగుటచే, దీనిలో గల నిస్సారమేదైనయుండిన, త్యజించి సారమును గ్రహింతురనితలంచెద. మఱియు దీనియందు యేదైన కొఱతపడిన భాగముగాని, లేక లోపముగాని గల్గియుండిన, తెలుపువారికి కృతజ్ఞుడను. అంతియేగాక, మరుముద్రణములో దానినిచేర్చి ముద్రించేలాగున నిరీక్షించువాడను. పరమకారుణికుడగు సర్వేశ్వరుడున్ను, పరమ పావనులగు ఋషివర్యులున్ను ఆనందింతురుగాక.

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు.

ఓం తత్ సత్.

ఇట్లు మీ చరాచర సుఖాభిలాషియగు,

మలయాళస్వామి.

ఓం తత్ సత్.

——



ఓం శివమ్.

# శ్రీ నిర్వాణనిలయము.

## ప్రథమ పటలము.

శ్లో॥ జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదః పరే నాత్మని విద్యతే।
చిదానందైకరూపత్వాద్దీప్యతే స్వయమేవ తత్॥

టీక॥ చిదానందైకరూపత్వాత్ - చిత్ = జ్ఞానస్వరూపిగాను, ఆనంద = ఆనంద స్వరూపిగాను, ఏకత్వాత్ = కేవల స్వరూపిగాను, ఉండుటవల్ల, పరే ఆత్మని = పరమాత్మయందు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదః— జ్ఞాతృ = జ్ఞాతయొక్కయు, జ్ఞాన = జ్ఞానముయొక్కయు, జ్ఞేయ = తెలియదగిన విషయముయొక్కయు, భేదః = వ్యత్యాసము, నవిద్యతే = లేదు, తత్ = ఆయాత్మ, స్వయమేవ = తనకుతానే, దీప్యతే = ప్రకాశించుచున్నది.

తా॥ జ్ఞాన స్వరూపిగాను, ఆనంద స్వరూపిగాను, కేవల స్వరూపిగాను యుండుటవల్ల పరమాత్మయందు జ్ఞాతృజ్ఞానజ్ఞేయ భేదములేదు. ఆ యాత్మ తనకుదానే ప్రకాశించుచున్నది.

విశేషార్థము॥ దీపాది ప్రకాశములు పరులచే ప్రకాశింప జేయబడునట్లు, ఆత్మ పరులచే ప్రకాశింపజేయబడునదికాదు. అది సూర్యుడేలాగున స్వయంప్రకాశుడై యుంటున్నాడో, యీ యాత్మయు తనకు దానే స్వయముగ ప్రకాశించుచున్నది. దీనికి పరప్రకాశ మవసరములేదు. ఇది త్రిపుటిరహితము. త్రిపుటియనగా—1. జ్ఞాత, 2. జ్ఞానము, 3. జ్ఞేయము. దీనికి తెలివి, తెలుసుకొనుట, తెలుసుకొనందగినది అనియు, ద్రష్ట, దర్శనము, దృశ్యము. ఆలాగున ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను వ్యత్యాసము లేదు. కావుననే ఆ బ్రహ్మవస్తువు త్రిపుటిరహితమని శాస్త్రములు తెలుపుటకు కారణము. జీవన్ముక్తులు తమ కట్టిస్థితి గల్గినదా, లేదాయని బాగుగా తమలోదాము విచారణ జేసికొనవలెను. అట్లయిన ముక్తులమైతిమా లేదా యను స్థితి తెలుసుకొనగలరు.



శ్లో॥ ఏకం చిన్మాత్రమస్తీహ శుద్ధం సౌమ్యమలక్షితమ్।
సూక్ష్మాత్సూక్ష్మతరం శాన్తం న జగన్న జగత్క్రియా॥

తా॥ ఏకమై, శుద్ధమై, అలక్షితమై, సూక్ష్మముకంటెను సూక్ష్మమై, మహత్తుకంటెను మహత్తై శాంతమైనట్టి చిన్మాత్రవస్తువే యి ప్రపంచమున గలదు. జగత్తుగాని, యద్దాని క్రియగాని వాస్తవముగ లేవు

శ్లో॥ యదాతు జ్ఞానదీపేన సమ్యగాలోక ఆగతః।
సంకల్పమోహో జీవస్య క్షీయతే శరదభ్రవత్॥

తా॥ జ్ఞానదీపముచే నెపుడు సమ్యక్ ప్రకాశమును బొందునో అపుడా జీవునకు శరత్కాలమేఘమువలె సంకల్పముయొక్క మోహావ క్షయించును.

వి॥ శరత్కాలమురాగా ఆకాశవీధిలో మేఘమునశించి నిర్మ ముగా నుండునట్లు, ఆత్మజ్ఞానోదయము గల్గిన యట్టి హృదయము మఱల సంకల్పమోహములుండవు. అదే దానికి గురుతు. వర్షఋతు వునందు ఆకాశము మేఘాకులమై యుండునట్లు, యెవరి హృదయముల విషయ మోహాది సంకల్పములుండునో అతడికను ఆత్మప్రకాశము శరత్కాలమునకు వచ్చినవాడు కాడు. ముక్తుడని తలంచువాడు దీని యాలోచించవలెను.

శ్లో॥ నిద్రావ్యపగమే జన్తుర్యథా స్వప్నం న పశ్యతి।
జీవోఽపి భావితే సత్యే తథా దేహం న పశ్యతి॥

తా॥ నిద్రనుండి మేల్కాంచిన పిదప, ప్రాణి స్వప్నము జూడనట్లు, సత్యస్వరూపమగు ఆత్మనెఱింగిన పిమ్మట, జీవుడిక దేహ భ్రాంతిని పొందకుండును.

వి॥ కలలో కన్నవస్తువులన్నియు, జాగ్రదవస్థలోనికి వచ్చి పిమ్మట మిథ్యయని యెట్లు తెలుసుకొనుచుండునో, యాలాగున సత జ్ఞానానందాత్మ యుదయించునప్పుడజ్ఞాన భ్రమ లన్నియు నశించును నిద్రలో తానెవడు, యెచ్చటనున్నాడు, దేనికొఱకు వచ్చెనను జ్ఞానమెట్ల డదో, మేల్కొనిన తరువాత తాను, పలానవాడు, పలానస్థలముల యుంటున్నాడు, పలానదానికొఱకు వచ్చియున్నాడను జ్ఞానమెట్ల గల్గియుండునో, జీవన్ముక్తుడుగూడ యాలాగునే యుండవలయును,

శ్లో॥ శాన్తి మాయాతి దేహోయం సర్వసంకల్ప సంక్షయాత్।
తదా రాఘవ నిశ్శేషం దీపస్తైలక్షయే యథా॥

తా॥ ఓ రాఘవా! సంకల్పక్షయముచే, యీ స్థూలదేహాభిమానము తైలరహిత దీపమువలె శమించును.

వి॥ అవిద్యా బుద్ధి నిలిచియుండుటకు, అజ్ఞాన వాసనరూపమగు తైలముండుటయే కారణము. తైలము నశించిన దీపమారునట్లు, యజ్ఞానరూపమగు విషయవాసన నశించిన, మఱల అవిద్యకు నిలకడ యుండదు. కావున వాసనాక్షయము తనకు గలిగినదా? లేదా? యని ముక్తులని తలంచువారు యోచించుకొనందగినది. అని యోగవాసిష్ఠము.

## నిర్వాణశబ్దముయొక్క యర్థము.

నిర్వాణప్రయోగము బౌద్ధమతగ్రంథములలో ఎక్కువగాకన్పట్టు చున్నది. అయితే ఉపనిషత్తులలోను, గీతయందును, శ్రీయోగవాసిష్ఠమునందును, నిర్వాణపదములు అనేకములు గలవు. అష్టోత్తరశతోపనిషత్తులలో నిర్వాణోపనిషత్తని యొకటిగలదు. యోగవాసిష్ఠమున ఉత్తరార్ధమంతయు నిర్వాణప్రకరణముగా వర్ణింపబడియున్నది. గీతలో ఐదు శ్లోకములయందు నిర్వాణపదము ప్రయోగింపబడియున్నది. శ్రీ శంకరాచార్యులు నిర్వాణషట్కమని ఆరు శ్లోకముల వ్రాసియున్నారు. ఆస్తికనాస్తికమతస్థులందఱును నిర్వాణశబ్దమును ప్రయోగించుచున్నారు. అందఱియొక్క ఆశయమున్ను నిర్వాణమునకు మోక్షమనియు, ముక్తియనియు, కైవల్యమనియు ఒకేవిధ అర్థమునే యంగీకరించియున్నారు. ప్రకృతిబన్ధమునుండి విమోచనము గలుగుటయే ముక్తియని యందురు. ఇదిఅందఱికిని సమ్మతము. ముక్తివిషయమై ఆయామతస్థులలో కొంత తారతమ్యము గలదు. అయితే జననమరణ దుఃఖమగు సంసారమునుండి విడుదలపొందుట మోక్షమని అందఱును యంగీకరించి యున్నారు. ఈ విషయమై ద్వైతాద్వైత విశిష్టాద్వైతులును, శైవవైష్ణవాది మతస్థులందఱును, బౌద్ధజైన క్రైస్తవ మహమ్మదాది మతములవారున్ను, జనన మరణ భవపాశమునుండి విముక్తిగల్గి శోకరహితమగు నిరతిశయానంద శాశ్వతపదవిని మోక్షమని యంగీకరించుయున్నారు. అమరకోశనిఘంటు

వున ఈఅర్థముగలదు, "ధీవర్గము. శ్లో॥ ముక్తిః కైవల్యనిర్వాణశ్రేయో నిశ్శ్రేయసామృతం, మోక్షోఽపవర్గ"

తా॥ 1. ముక్తి, 2. కైవల్యము, 3. నిర్వాణము, 4. శ్రేయస్సు, 5. నిశ్శ్రేయస్సు, 6. అమృతము, 7. మోక్షము, 8. అపవర్గము, ఈఎనిమిదియు మోక్షముయొక్క పేర్లు. నిర్వాణముయొక్క ధాత్వర్థము "నిర్వాస్తి నిర్గచ్ఛన్తి దుఃఖాదయోఽస్మిన్నితి= దీనియందు దుఃఖాదులు నిర్గతమవును" అనగా జీవునికి అజ్ఞాన సంబంధమగు ఎన్నివిధములగు క్లేశములు, బంధములు, ఆవరణములుగలవో, అవన్నియును వదలిపోయిన స్థితి యేదిగలదో అదియే నిర్వాణము. అట్టిముక్తాత్మునకు మరల ప్రకృతి సంస్కారములుగాని, జన్మాంతరవాసనలుగాని, త్రిగుణములుగాని, సంచిత, ఆగామి, ప్రారబ్ధాదికర్మలుగాని యేవియు యుండకూడదు. మరల కర్మశేషముండిన ఆ ఆత్మను ఎట్లు విముక్తాత్మయనిచెప్పనగును? ఈసత్యమును తెలుపుటకొరకే ఈగ్రంథమును వ్రాయతలంపుగల్గినది. నిర్ × విద జ్ఞానే, ఘఞ్, నిర్వేదః. ఈశబ్దమునకు మూడుఅర్థములుగలవు. 1. అనుతాపే, 2. ఔదాసీన్యే, 3. వైరాగ్యే, 1. అనుతాపము, 2. ఔదాసీన్యము, 3. వైరాగ్యము.

భగవద్గీత॥ అ. 2. శ్లో॥ 72.

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥

శ్రీశంకరాచార్యాః:- బ్రహ్మనిర్వాణం, బ్రహ్మనిర్వృతిం, మోక్షం॥

శ్రీనీలకంఠవ్యాఖ్యా 'చతుర్థరీ' నిర్గతం వానం గమనం యస్మిన్ ప్రాప్యే బ్రహ్మణి నిర్వాణం॥ యేప్రాప్యమగు పరబ్రహ్మమందు లోకాంతర గమనములేదో, యే పరబ్రహ్మప్రాప్తిపొందినమరల జనన మరణగమనము లుండవో, అదియే నిర్వాణము.

శ్రుతి॥ నతస్యప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంతే బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి॥

అర్థము. ఆ బ్రహ్మజ్ఞానియొక్క ప్రాణములు లోకాంతరమునకు వెడలిపోవు ఈ బ్రహ్మమునందే లీనముగుచున్నవి. బ్రహ్మస్వరూపుడై బ్రహ్మమునే పొందుచున్నాడు. అనగా బ్రహ్మస్వరూపుడగుటయే

బ్రహ్మమును పొందుటయగును. దానికి పూర్వముండిన జీవోపాధులు, జీవభావములు జీవునికి సంబంధించిన త్రిగుణములు వదలిపోవడమే బ్రహ్మప్రాప్తియను నిర్వాణము యగును.

శ్రీమధుసూదనవ్యాఖ్యా:- బ్రహ్మనిర్వాణం, బ్రహ్మణి నిర్వాణం. నిర్వృతిం బ్రహ్మరూపం నిర్వాణమితి వా॥ = బ్రహ్మయందు నిర్వాణము నిర్వృతి, బ్రహ్మరూపమే నిర్వాణము.

శ్రీధరీవ్యాఖ్యా:- బ్రహ్మణి నిర్వాణం లయం॥= బ్రహ్మయందులయ మగుట నిర్వాణమనబడును.

గీత అ. 5 శ్లో॥ 24.

యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతి రేవహి।
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధి గచ్ఛతి।
బ్రహ్మనిర్వాణం.

శ్రీశంకరాచార్యాః:-బ్రహ్మనిర్వాణం బ్రహ్మణినిర్వృతిం మోక్షం॥
శ్రీనీలకంఠవ్యాఖ్యా:- బ్రహ్మనిర్వాణంగత్యప్రాప్యపరమానందంబ్రహ్మ॥

శ్రీ శంకరాచార్యులు, శ్రీ నీలకంఠవ్యాఖ్య, శ్రీమధుసూదన సరస్వతి, శ్రీభాష్యోత్కర్ష దీపిక, శ్రీధరీవ్యాఖ్య, వీరందఱును ఒకేవిధ అర్థమునే జెప్పిరి. అందువల్ల వారివ్యాఖ్యలన్నియు ఇచ్చుట చెప్పబడ లేదు.

గీత అ. 5. శ్లో. 25.

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితేరతాః॥

దీనిలోగూడ "బ్రహ్మనిర్వాణ" పదముగలదు. అయితే ఋషు లనియు, క్షీణకల్మషులనియు, రెండుపదములు ప్రయోగింపబడియున్నవి. ఋషిశబ్దమునకు అనేక అర్థములుండినను, ఇంద్రియాతీతజ్ఞానముగలవారని ముఖ్యార్థము. క్షీణకల్మషులు = అవిద్యా సంబంధ సకల మాయామా లిన్యము నశించినవారని యర్థము. అట్టివారే బ్రహ్మనిర్వాణమును పొంద గలరు. డిటో 26. శ్లో:—

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥

దీనిలోగల "కామక్రోధవియుక్తానాం. యతీనాం, యతచేతసాం, విదితాత్మనాం" అనిప్రయోగింపబడిన పదముల యర్థములను ముక్తులని తలంచువారు భాష్యగ్రంథములలో బాగుగ తెలిసికొనవలయును. అట్టి వారే బ్రహ్మనిర్వాణమును పొందగలరు.

గీత అ. 6. శ్లో॥ 15.

యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥

దీనియందు "యుంజన్నేవం, సదాత్మానం, యోగీ, నియతమానసః" అని ప్రయోగింపబడిన పదములయొక్క అర్థమునుగూడ, ఇప్పుడు ముక్తులని తలంచువారు టీకా తాత్పర్యాది గ్రంథములలో లెస్సగా చూచి మననము చేసికొన వలసినది.

శ్రీ శంకరాచార్యాః- నిర్వాణపరమాం, నిర్వాణం మోక్షః, తత్పరమానిష్ఠా యస్యాః శాంతేః సా నిర్వాణపరమా = ఎచ్చట ప్రకృతి శమించియుండునో అదియే పరమ నిర్వాణము. దానియందు గల నిష్ఠయే, నిర్వాణమని గూడ గ్రహించుకొన వలయును. తక్కిన భాష్య కర్తలుగూడ ఈ లాగుననే వ్రాసియున్నారు.

శ్రీ నీలకంఠవ్యాఖ్యా- నిర్వాణంమోక్షః, తదేవ పరమానిష్ఠా యస్యాశ్శాంతేః.

## నిఘంటువులు.

1. నిర్వాణంనిర్వృతౌ మోక్షేవినాశేగజమజ్జనే(వైజయంతీ,తృతీరకాండే)
2. నిర్వాణమస్తంగమనే నిర్వృతౌగ జమజ్జనే, అపవర్గేచ (విశ్వప్రకాశః)
3. కైవల్యం నిర్వాణం నిశ్శ్రేయసమమృతమక్షరం బ్రహ్మ అపునర్భవోఽపవర్గో ముక్తిర్మోక్షో మహానందః। సనాతనం ధ్రువం నిత్యం శాశ్వతం స్యాదనశ్వరం (హలాయుధః -1-124.)
4. నిర్వాణ మోక్ష నిర్వృత్యోర్విఘూతే కరిమజ్జనే (అనేకార్థసంగ్రహే- తృతీయః కాండః.)
5. నిర్వాణమస్తగంమనం నిర్వాణం గజమజ్జనం। నిర్వాణమపవర్గోఽపి నిర్వాణం నిర్వృతిం విదుః (శాశ్వతకోశః. 13 శ్లో॥)

6. నిర్వాణమ స్తంగమనే నిర్వృతౌ గజమజ్జనే। సంగమేప్యపవర్గేచ (మేదినీ.)
7. నిర్వాణోమునివహ్న్యాదౌ (అమరః, తృ.కాం, విశేష్య నిఘ్న వర్గః.)
8. నిర్వాణం మోక్షనిర్వృత్యోః విధానే కరిమజ్జనే (హైమః.)

సర్వమతములవారు నిర్వాణపదమునకు "మోక్షము" అని అర్థము చెప్పుటలో నేకీభవింతురు. కాని ఆ మోక్షముయొక్క స్వరూపవిషయమున మాత్రము ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గమును అవలంబింతురు. ఇందు శంకరాచార్యులవారు "విద్వాన్ శాస్త్రాచార్యోపదేశజనిత జ్ఞాన దీపప్రకాశితం సద్బ్రహ్మాత్మానం ప్రవిశ్యనావర్తతే" = విద్వాంసుడు శాస్త్రముయొక్కయు, ఆచార్యులయొక్కయు, ఉపదేశజన్యమగు జ్ఞాన దీపముచే ప్రకాశితమగు సద్బ్రహ్మస్వరూపమగు ఆత్మనుబొంది, తిరుగా రానేరడు. ఇదియే మోక్షము అని చెప్పుదురు. రామానుజాచార్యుల వారు, ముక్తుడు వైకుంఠమున శ్రీమన్నారాయణునితో సమానమగు ఐశ్వర్యాదికము గలవాడై యుండును. ఇదియే మోక్షమని వచింతురు. మధ్వాచార్యులవారు పై విషయము నంగీకరించుచు, సాధనభేదమును బట్టి ముక్తియందును భేదముగలదని యంగీకరింతురు. బౌద్ధులు, ఏ విధమగు క్లేశములులేని (జననమరణాది దుఃఖములులేని) ఆనందస్థితియే మోక్షమందురు. యోగులు ప్రకృతి సంబంధమును వదలి పురుషుడు కేవలుడై యుండుటయే మోక్షమని-పలుకుదురు.

శ్లో॥ తైలక్షయే యథా దీపో నిర్వాణమధిగచ్ఛతి।
కర్మక్షయే తథా జన్తుర్నిర్వాణమధిగచ్ఛతి॥

తా॥ తైలము నశించునప్పుడు దీపమేలాగున స్వయముగా ఆరిపోవునో, ఆలాగున కర్మములన్నియు నశించునప్పుడు జీవునియొక్క ఆవరణములన్నియు కర్మలన్నియు నశించిపోవును. అట్టిప్రకృతినుండి విముక్తిని పొందినజీవుడు తనయొక్క నిజస్వరూపమున నిలుచుటెుది గలదో అదియే నిర్వాణమనబడును.

యోగవాసిష్ఠము.

శ్లో॥ సర్వమేవపరిత్యజ్య మహామానీ భవానఘ।
నిర్వాణవాన్నిర్మననః క్షీణచిత్తః ప్రశ

తా॥ పాపరహితుడవగు రామచంద్రా! నీవు సమస్తవాదములను పరిత్యజించి (లేక దృశ్యమంతటిని బారద్రోలి) మనోవర్జితుడవై, శాంత చిత్తుడవై, నిర్వాణయుక్తుడవై, ప్రశాంతబుద్ధిగల్గి మహామానివై ఆత్మ యందే స్థితిగల్గియుండుము.

శ్లో॥ అహమంశే విద్యాక్షీణే సర్వమేవ క్షయంగతమ్।
నకించిచ్చ క్వచిత్క్షీణం నిర్వాణైకఘనం స్థితమ్॥

తా॥ తత్త్వబోధచే అహం దేహాభిమాన అంశముక్షయింప మమత్వాంశమగు జగత్తంతయునుగూడ క్షయించిపోవును. కాని యథార్థముగ నేదియు క్షయించుటలేదు. ఏలననగా సర్వత్ర నిర్వాణ ఘనమై ఏకమైనట్టి ఆత్మయే స్థితిగల్గియున్నది.

శ్లో॥ విద్ధి చిన్మాత్రమేవేదమసద్రూపోపమంతతమ్।
తేనాలం మౌనమాస్స్వైవం సర్వం నిర్వాణమాత్రకమ్॥

తా॥ ఓరామచంద్రా! అసద్రూపమును బోలి వ్యాపించినట్టి చిన్మాత్రముగనే నీవీసమస్తమును నెఱుంగుము. అట్లు సర్వము నిర్వాణ రూపమగు ఆత్మమాత్రముగనే యెఱిగినవాడవై మౌనముగనుండుము.

శ్లో॥ యచ్చకామసుఖంలోకే యచ్చదివ్యం మహత్సుఖమ్।
తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీంకలామ్॥

తా॥ ప్రపంచములో సర్వసంకల్పప్రాప్తియగు సుఖమేదికలదో, స్వర్గలోకమందు యేదైతే మహత్తైన దివ్యసుఖముగలదో, అవి యన్నియు అన్తఃకరణములోగల తృష్ణనశించిన సంయమియొక్క నిర్వాణ సుఖములో పదునాఱవ భాగముయొక్క సుఖమునైనా కలుగ జేయజాలవు.

శ్లో॥ దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవలరూపతః।
యస్తిష్ఠతి సతుబ్రహ్మన్బ్రహ్మ నబ్రహ్మవిత్స్వయమ్॥

తా॥ దర్శనాదర్శనములను రెండింటిని విడచినవాడై యెవడైతే స్వయముగా కేవలాత్మ స్వరూపుడై నిలిచియుండునో అతడు బ్రహ్మ వేత్తగాడు. మఱేమన స్వయముగా బ్రహ్మమే యగుచున్నాడు. అట్టి స్థితియే నిర్వాణము. బ్రహ్మవేత్తయనిచెప్పినచో బ్రహ్మమునెఱింగినవాడే

యని యర్థము ఏర్పడును. అచ్చట త్రిపుటిగలదు. అట్టి త్రిపుటిలేని స్థితియే కేవలాత్మ స్థితియగును.

శ్లో॥ ప్రజ్ఞాప్రతిష్ఠా భూతానాం ప్రజ్ఞాలాభః పరోమతః।
ప్రజ్ఞానిశ్శ్రేయసీలోకే ప్రజ్ఞాస్వర్గో మతస్సతామ్॥

తా॥ సమస్తప్రాణికోట్లకు ప్రజ్ఞానము ప్రతిష్ఠితమై యున్నది. దీనికి మహావాక్యములలో ప్రజ్ఞానం బ్రహ్మయని తెలుపుటకు కారణము. అట్టి ప్రజ్ఞాన లాభమునకు పరమైనలాభము మఱియొండులేదు. అట్టి ప్రజ్ఞాప్రాప్తియే లోకమున మోక్షమనంబడును. దానికి నిర్వాణమని పేరుగూడగలదు. ఇదియే సత్పురుషులకు నిత్యసుఖమని మతము.

శ్లో॥ నిర్వేదాదేవ నిర్వాణం నచ కించిద్విచిన్తయేత్।
సుఖంవై బ్రాహ్మణోబ్రహ్మ నిర్వేదేనాధిగచ్ఛతి॥

తా॥ నిర్వేదమువల్లనే నిర్వాణము సిద్ధించుచున్నది. దీనియందు మఱల చింతింప నక్కఱలేదు. నిర్వేదముచేతనే బ్రహ్మనిష్ఠుడు శాశ్వత సుఖమగు బ్రహ్మమును పొందుచున్నాడు. నిర్వేదమనగా హృదయములలోగల సర్వ ఆవరణములు నశించుస్థితియే యగును. అట్టిదే నిర్వాణము, అని శాంతిపర్వము.

శ్లో॥ యథా స్వనుష్ఠితంధ్యానం తథా కుర్వన్తి యోగినః।
మహర్షయోజ్ఞాన తృప్తా నిర్వాణ గతమానసాః॥

తా॥ ఏలాగున మహాఋషులు ధ్యానమందు మంచినిష్ఠగల వారై యున్నారో, యోగులుగూడ అలాటి నిష్ఠగలవారై యున్నారు. వారందఱును, జ్ఞానముచే సంతృప్తులగుచున్నారు. వారి మనస్సులో గల వృత్తులన్నియు విలీనములయినవి. అట్టి స్థితియే నిర్వాణము, అని వ్యాసమతము.

శ్లో॥ సమ్యక్తత్త్వావబోధేన దుర్బోధే క్షయమాగతే।
గలితే వాసనావేశే విశోకం ప్రాప్యతే పదమ్॥

తా॥ తత్త్వావబోధము చక్కగా గలిగిన దుర్బోధములగు సంస్కార వాసనలు అన్నియు వదలిపోవును. అప్పుడు శోకరహితమగు బ్రహ్మ పదము లభింపగల్గును. ఇప్పుడు కుంభమునిరూపధారిణియగు,

చూడాల రాజర్షియగు శిఖిధ్వజునకు పరమనిర్వాణ స్వరూపమును గూర్చి చెప్పినదానిని చూడుడు. శ్రీ యోగవాసిష్ఠము:—

శ్లో॥ చిన్మాత్రమమలం శాన్తమాభాతం పరమం నభః।
సమస్తకలనోన్ముక్తం యుక్తం పరమయా ధియా॥
యదేకోదితమత్యచ్ఛం శాన్తమాతతముజ్జ్వలమ్।
పరమాత్మాత్మకం తేజస్సిమితం జ్ఞప్తిమాత్రకమ్।

తా॥ అయ్యది చిన్మాత్రమై, నిర్మలమై, శాంతమై, ప్రకాశమయమై, అతిసూక్ష్మమగు చిదాకాశమై, సమస్తకల్పనావిముక్తమై, నిజస్వరూపమును సాక్షాత్కరించునట్టి బుద్ధితో గూడినదై, ఏకమై, అతిస్వచ్ఛమై, సర్వత్రవ్యాప్తమై, ఉజ్జ్వలమై, పరమాత్మమయమై, గంభీరమై, తేజోరూపమై, జ్ఞప్తిమాత్రమై యుండును.

శ్లో॥ అప్రతర్క్యమవిజ్ఞేయం సమం శివమనిన్దితమ్।
బ్రహ్మనిర్వాణమాపూర్ణమాపూర్ణోదితసంవిదా॥

తా॥ మఱియు ఆపరమాత్మయగు బ్రహ్మము తర్కించుటకు యోగ్యముకానిదై, అవిజ్ఞేయమై, సర్వత్ర యేక రసమై, శివమై, అనిందితమై, నిర్వాణరూపమై, సర్వత్రయుదయించిన నిజబోధచే పూర్ణమై యొప్పును.

శ్లో॥ ముహూర్తమేవ నిర్వాణం యదిచేతః పరేపదే।
తత్తత్పరిణతం విద్ధి తత్రైవాస్వాదమాగతమ్।

తా॥ మనస్సు పరమపదమున ముహూర్తకాలము విశ్రాంతి నొందినను బ్రహ్మాకారముగ పరిణతమగును. దానిచే మనస్సు నిరతిశయమగు ఆనందాస్వాదమును బొంది మరల లేవనిచ్ఛగొనదు. మనస్సు వృత్తిరహితమై బ్రహ్మాకారవృత్తి గలదియగుటయే నిర్వాణమనంబడును. అట్టిమనస్సునుండి మరల వృత్తులుగాని గుణములుగాని పుట్టవు.

శ్లో॥ యది సాంఖ్యేన విశ్రాన్తం చేతో యోగేన వాపి తే।
క్షణం తత్సత్త్వతాం యాతం నభూయ ఇహ జాయతే॥

తా॥ నీమనస్సు సాంఖ్యయోగము ననుసరించిగాని, లేనిచో యోగమార్గము ననుసరించిగాని విశ్రాన్తినొంది క్షణమైనను ఆత్మతత్త్వముతో ఐక్యమును పొందియుండిన మరల యుత్పన్నము గాదనిగ్రహింపుము.

శ్లో॥ విగలితాత్మపదం విగలన్మనః సుభగ సత్త్వముతీహహి కథ్యతే।
నపునరేతి కలామలినం పదం కనకతామివ తామ్రముపాగతమ్॥

తా॥ సౌభాగ్యశీలుడవగు రామచంద్రా! నేనుచెప్పిన త్రివిధోపాయముల నాశ్రయించి పొందబడు జీవన్ముక్తి స్థితియందు జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థలును, భ్రాంతియును, దాని బీజములును, మనస్సును గూడ నశింప, దగ్ధపటమునుబోలు సత్త్వము మాత్రమే మిగులును. వాసనాబీజములు లేకుండుటవలన నయ్యాది రాగద్వేషాదులకు లోనై సంసారకారణము కాజాలదు. స్పర్శవేది వలన బంగారముగ మార్చబడిన రాగివలె ఈ సత్త్వము మరల కళంకమును బొందదు.

వి॥ ముక్తాత్మునియొక్క స్వరూప మిందు వర్ణించబడినది. స్పర్శవేదిచే తామ్రము బంగారమైన, మరల దానినుండి చిలుము యెట్లు పుట్ట జాలదో, ఆలాగున జీవత్వమునుండి బ్రహ్మత్వము నొందిన ఆత్మనుండి మరల విషయములు గలుగకూడదు. ముక్తాత్ముడు సువర్ణమువంటి వాడనియు, బద్ధాత్ముడు తామ్రమువంటి వాడనియు గ్రహించుకొన వలయును.

శ్లో॥ క్షీయన్తే సర్వదుఃఖాని త్రుట్యన్తి గ్రన్థయోఽభితః।
సంశయాస్సమతాం యాన్తి సర్వకర్మాణి చానఘ॥

తా॥ పాపరహితుడా! అప్పుడు దుఃఖములన్నియు తొలగిపోవును. సంసారగ్రంథులు విడిపోవును. సంశయము లన్నియు ఛిన్నములగును. కర్మలన్నియు పైజెప్పినవానివలె సమావస్థను పొందును. అనగా అవియు వాటివలె నశించిపోవును.

శ్లో॥ జ్ఞేయం విదురథాత్మానం సంశుద్ధం జ్ఞప్తిరూపిణమ్।
సచసర్వగతో నిత్యం నాస్తమేతి నచోదయమ్॥

తా॥ పరమ పవిత్రమును, జ్ఞప్తిరూపమును, సర్వగతమును, జననమరణములను ఉదయాస్తమయములు లేనిదియును, నిత్యమును నగు ఆత్మనే జ్ఞేయమందురు. ముండకశ్రుతియు యీలాగున తెలుపుచున్నది.

శ్లో॥ భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

తా॥ పరావరమగు పరబ్రహ్మ సాక్షాత్కారము గలుగునప్పుడు హృదయ గ్రంథులన్నియు భేదింపబడును. సర్వసంశయములు ఛిన్నము లగును. కర్మలన్నియు. క్షీణించిపోవును.

వి। వేదమీలాగున చెప్పుచుండగా బ్రహ్మవేత్తలకు గుణములతో, వృత్తులతో సంబంధము లేదని అమాయికులతో చెప్పి, సమర్థించుకొనుట ఎంత అధర్మమో యూహించుకొనుడు.

శిఖిధ్వజుడు తనస్వానుభవమును తెలుపుచున్నాడు-

శ్లో॥ నిష్కలఙ్కా సమాశుద్ధా నిరహంకారరూపిణీ।
శుద్ధసంవేదనాకారా శివం సన్మాత్రమచ్యుతమ్॥

తా॥ అయ్యది కళంకరహితము, సమస్వరూపము, శుద్ధము, అహంకార వివర్జితము, శుద్ధసంవేదనమే దానిస్వరూపము. అయ్యది భూమానంద స్వరూపమగుటవలన పరమ మంగళమయము. సన్మాత్రము. అది స్వస్వరూపమగు భూమానంద మంగళ స్వభావమునుండి విచ్యుతిగానందువలన, అచ్యుతమనబడుచున్నది.

శ్లో॥ నిర్వామి భ్రమనిర్ముక్తమాసే నిర్మన్దరాబ్ధివత్।
అసదాభాసమత్యచ్ఛమనన్తమజమచ్యుతమ్॥

తా॥ నేడు భ్రమరహితమగు నిర్వాణమును బొందుచున్నాను. మందర పర్వతము లేని సముద్రమువలే నేనిపుడు నిశ్చలభావమున వెలయుచున్నాను. ఈ ఆత్మాకాశమున దృశ్యాభాస అనున దేమియును లేదు. ఇది అత్యన్తనిర్మలము, అజము (జన్మరహితము) అచ్యుతము.

వి॥ శిఖిధ్వజుడు పరమనిర్వికల్పసమాధిలో పొందినస్థితియు ఈ నిర్వాణమే. సమాధినిగురించి గీతలో శ్రీకృష్ణభగవానుడు యుపదేశించినదిన్ని చూడుడు—

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాస్మృతా।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః॥

తా॥ నియమింపబడిన చిత్తముగలవాడును, ధ్యానయోగమును అభ్యసించువాడును అగు ఆత్మధ్యానయోగియొక్క మనస్సునను, గాలిలేని చోటనుండెడు దీపమువలె జ్ఞేయస్వరూపమగు ఆత్మజ్యోతి వెలుగుచుండునని ఉపమానము చెప్పబడినది.

శ్లో॥ రూపాలోకమనస్కారా నీరసాగమభావనా।
సమ్యగ్జ్ఞానావబోధస్య నిర్వాణం వై విదుర్బుధాః॥

తా॥ సమ్యక్ జ్ఞానోదయముచే బాహ్యరూపాలోకములున్ను, అంతరిక మనఃకల్పనలున్ను, అన్నియు సారరహితముగ తోచును. అట్టి స్థితినే నిర్వాణ (మోక్షము) అని విజ్ఞులు పల్కుదురు.

శ్లో॥ చిత్తే త్యక్తే లయం యాతి ద్వైతమైక్యం చ సర్వతః।
శిష్యతే పరమం శాన్తమచ్ఛమేకమనామయమ్॥

తా॥ చిత్తము త్యజింపబడగా ద్వైతము, ఐక్యమున్ను అంతట లయ మెుంది, కేవలము పరమశాంతమై, స్వచ్ఛమై, నిరామయమై, ఏకమైనట్టి పరమాత్మయే శేషించును.

శ్లో॥ ఆత్మజ్ఞానంవినా సారో నాధిర్నశ్యతి రాఘవ।
భూయో రజ్జ్వవబోధేన రజ్జు సర్పోహి నశ్యతి॥

తా॥ ఓ రాఘవా! ఆత్మజ్ఞానము లేక సారము, అనగా జన్మాది వికారములకు మూలమగు భవవ్యాధి నశింపదు. రజ్జువు యొక్క జ్ఞానము పూర్ణముగ లేనిచో సర్పభ్రాన్తి నశింపదుగదా!

శ్లో॥ యో న నిర్వాసనోనూనం సర్వధర్మపరోఽపిసన్।
సర్వజ్ఞోఽప్యతిబద్ధాత్మా పంజరస్థో యథా హరిః॥

శ్లో॥ యస్యాస్తి వాసనాబీజమత్యల్పం చితిభూమిగమ్।
బృహత్సంజాయతే తస్య పునః సంసృతి కాననమ్॥
అభ్యాసాద్ధృది రూఢేన సత్యసంబోధ వహ్నినా॥
నిర్దగ్ధంవాసనాబీజం నభూయః పరిరోహతి.॥
దగ్ధన్తు వాసనాబీజం ననిమజ్జతి వస్తుషు।
సుఖదుఃఖాదిషుస్వచ్ఛం పద్మపత్రమివాంభసి॥

తా॥ వాసనారాహిత్యమును పొందనివాడు సర్వధర్మముల నాచరించుచున్నను, సర్వశాస్త్రవేత్తయైనను, పంజరమునందలి చిలుకవలె నత్యంతము బద్ధుడే యగుచున్నాడు. చిత్తభూమియందు అతిసూక్ష్మమగు వాసనాబీజము మిగిలియున్నను దానివలన సంసారారణ్యము విశాలమై, గొప్పదై విస్తరించును.

సత్యజ్ఞానమను అగ్నిని హృదయమున అభ్యాసమువలన నిల్పి వాసనాబీజమును సంపూర్ణముగా దగ్ధమొనరించిన మరల సంక రించుటకు అవకాశముండదు.

స్వచ్ఛమగు పద్మపత్రము (తామరాకు) నీటమునుగనట్లు, దగ్ధమైన వాసనాబీజముగల మనస్సు మరల సుఖదుఃఖముల నొసగు వస్తువుల యందు జిక్కుకొనదు.

శ్లో॥ అవిద్యాం ప్రకృతిం విద్ధి గుణత్రితయ ధర్మిణీమ్।
ఏషైవ సంసృతిర్జన్తోరస్యాఃపారం పరంపదమ్॥

తా॥ గుణత్రయ ధర్మములతోగూడుకొనిన ప్రకృతియే అవిద్య యని గ్రహింపుము. ఇదియే జీవులయొక్క జననమరణ సంసార దుఃఖమునకు హేతువు. దీని పారముననే పరమపదమగు మోక్షము వెలయుచున్నది.

శ్లో॥ వివేక విశదం చేతః సత్త్వమిత్యభిధీయతే।
భూయః ఫలతి నో మోహం దగ్ధబీజమివాంకురమ్॥

తా॥ వివేక జ్ఞానోదయమైన చిత్తము సత్త్వమనబడుచున్నది. దగ్ధబీజమున అంకురము జన్మింపజాలనట్లు అందు మరల మోహ ముద్భవింప జాలదు.

శ్లో॥ ప్రాప్తప్రాప్యో భవాన్నామ సత్త్వభావముపాగతమ్।
చిత్తం జ్ఞానాగ్నినా దగ్ధం నభూయః పరిరోహతి॥

తా॥ జ్ఞానాగ్నిచే దగ్ధమై సత్త్వభావమునొంది కృతకృత్యత నందిన చిత్తము మరల నుద్భవింపదు.

శ్లో॥ జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం జ్ఞ చిత్తం సత్త్వముచ్యతే।
నామార్థాన్యత్వభాక్చిత్తం బోధాత్తామ్రమనువర్ణవత్॥

తా॥ జ్ఞానియొక్క చిత్తము చిత్తమనబడదు, సత్త్వమనబడును. చిత్తమే నామ, రూప, అర్థముల భేదమును గలుగచేయునది అగును. ఆ చిత్తము బోధచే సత్త్వమగును. ఎటులనగా, స్పర్శవేదిచే తామ్రము స్వర్ణమగునటుల యుండును.

వి॥ చిత్తమనియు, మనస్సనియు ఒకటేయర్థము. దృశ్యవాసనలతో కూడినదానిని చిత్తమనంబడును. అదిలేనిది సత్త్వమనబడును. అలాగున

దృశ్యవిషయమును మననముచేయుదానికి మనస్సనబడును. అదిలేనప్పుడు అమనస్కమనబడును.

శ్లో॥ మూఢంచిత్తం చిత్తమాహుః ప్రబుద్ధం సత్త్వముచ్యతే।
అప్రబుద్ధాహి చిత్తస్థాః సత్త్వస్థాస్తు మహాధియః॥

తా॥ మూఢులచిత్తమునే చిత్తమందురు. జ్ఞానులచిత్తము సత్త్వమందురు. అజ్ఞానులే చిత్తమందుందురు. జ్ఞానులగు మహాబుద్ధిమంతులు సత్త్వమందుందురు.

శ్లో॥ భూయః ప్రజాయతే చిత్తం సత్త్వం భూయో న జాయతే।
అప్రబుద్ధస్య బన్ధోఽస్తి నప్రబుద్ధస్య భూపతే॥

తా॥ ఓరాజా! జ్ఞానముపొందని చిత్తము మరలమరల యుత్పన్నమగును. జ్ఞానముగల సత్త్వమగుచిత్తము అటులుత్పన్నముగాదు. అజ్ఞానికి బంధము కలదు; జ్ఞానికి బంధములేదు.

వి॥ అజ్ఞాని చిత్తము తామ్రము వంటిదనియు, జ్ఞానిచిత్తము స్ఫుటముచేసిన తామ్రము బంగారమగునటుల యుండును. తామ్రమునకు చిలుముగలదు. స్వర్ణమునకు చిలుముయుండదు. అజ్ఞానిచిత్తము త్రాడు వంటిది. జ్ఞానిచిత్తము అగ్నిదగ్ధపాశము వంటిది. కాలనిత్రాడు బన్ధనమునకు యుపయోగపడును. కాలినత్రాడు త్రాడురూపముగా కనుపించినను బన్ధనమునకు యుపయోగపడదు. జ్ఞానములేనిచిత్తము పచ్చివిత్తనము వంటిది. జ్ఞానముగల చిత్తము వేగినవిత్తనము వంటిది. పచ్చివిత్తనము అంకురించును. యుడికిన విత్తనము అంకురించదు. చూచినప్పుడు రెండున్ను ఒకేవిధముగాయుండినను వృత్తియందు భేదముగలదు. ఆలాగున ఆత్మజ్ఞానియు, అజ్ఞానియు శరీరాద్యవయవములచేతను, అన్నపానాది క్రియలచేతను ఒకేవిధముగ కనుపించినను, జ్ఞాని వృత్తిరహితుడై యుండును; అజ్ఞాని వృత్తిసహితుడై యుండును. ఈరెండుగుణములచే జ్ఞానాజ్ఞానులను విభజించి తెలిసికొనవచ్చును.

యోగవాసిష్ఠము — నిర్వాణప్రకరణము.

శ్లో॥ బ్రహ్మేదంఘనమజరాద్యనన్తమేకం
సంకల్పస్ఫురణమవిద్యమానమేవ।

బుద్ధ్వైవం వ్యపగత మానమేయమోహో
నిర్వాణం పరివిహరన్విశోకమాస్స్వ॥

తా॥ ఓరామచంద్రా! ఈప్రకారముగ శేషించిన ఆత్మవస్తువు ఆనందఘనమై, అనంతమై, జరాది వికారరహితమై, జీవజగద్రూపములు సంకల్పముయొక్క స్ఫురణమాత్రములేమై, అసత్తై (లేనివై) పఱఁగుచున్నవి. ఇట్లు ఆత్మతత్త్వమును తెలిసి ప్రమాతృప్రమాణప్రమేయాది త్రిపుటీ మోహమును బారద్రోలి నిర్వాణమగుబ్రహ్మమేలయి నిరతిశయ బృహద్రూపముచే నంతటవ్యాపించి విహరించుచు దుఃఖరహితుఁడవై చెన్నొందుము.

శ్లో॥ తదభావాజ్జగన్నాస్తి చిత్త్వం జగదభావతః।
శిష్టం నిర్వాణమేవాతః శాన్తమాస్స్వ యథాసుఖమ్॥

తా॥ ఓ విద్యాధరా! అహంకారమను బీజమే లేనపుడేక నద్దాని కార్యమగు జగత్తున్ను లేకయే యున్నదగును. కావున జగజ్జీవాదుల అభావముచే శేషించునట్టి చిద్రూపమైన నిర్వాణస్వరూపమున శాంతముగను, సుఖపూర్వకముగను నుండుము.

శ్లో॥ ప్రబోధ్యమానోఽపి మయా భూయోభూయస్తతస్తతః।
నపపాత పురోదృశ్యే పరంనిర్వాణమాగతః॥

తా॥ అపుడు నేనాతనిని మరలమరల యిటునటుండి మేల్కొలిపినను పరమనిర్వాణదశనుబొందిన యాతడు, మరలశబ్దాది విషయములపై పునరుఁ బడకయుండెను.

శ్లో॥ ఆసనే శయనే యానే స్థితో యత్నైర్న బోధ్యతే।
నిద్రాలురివ నిర్వాణమనోమనన నిర్వృతః॥

తా॥ మనస్సంకల్పరహితుడై షష్ఠాదిభూమికలందారూఢుడై అట్టిజ్ఞాని ఆసన, శయన, వాహనములపైఁ గూర్చొని నిర్వాణదశనుబొందియున్నవాడై నిద్రాళువువలె యత్నములచేతనుగూడ మేల్కొలుపబడకుండును.

శ్లో॥ కర్మ కుర్వన్న కుర్వన్వా వీతరాగో నిరామయః।
నిర్మనానిత్యనిర్వాణః పుమానాత్మని తిష్ఠతి॥

తా॥ వీతరాగుడును, మనోవికార రహితుడునగు జ్ఞాని కర్మలం జేయుచున్నను, లేక చేయకయున్నను సదా అమనస్కుడై, నిత్యనిర్వాణ రూపుడై (మోక్షమునుపొందినవాడై) ఆత్మయందే స్థితిగల్గియుండును.

శ్లో॥ స్పన్దనేఽస్పన్దనేచైవ యత్పాషాణవదాసితమ్।
అజడస్యైవతద్విద్ధి నిర్వాణమజరంపరమ్॥

తా॥ చేష్టయందును, తదభావమందును, శిలవలె నిశ్చలమైనట్టి చైతన్యముయొక్క ప్రశాంతిస్థితి యేదిగలదో అద్దానినే నీవు అజరమైన నిర్వాణపదమని యెఱుగుము.

శ్లో॥ తత్రాహన్తా నచత్వత్తా నానహన్తా నచాన్యతా।
కేవలం కేవలీభావో నిర్వాణమమలం శివమ్॥

తా॥ ఆ ఆత్మపదమున అహంత్వము (నేననుభావము)గాని త్వంత్వము (నీవనుభావము) గాని, అనహంత్వముగాని, అన్యత్వముగాని లేవు. కేవలము కేవలీభావమైన నిర్వాణరూపమైనట్టి నిర్మలమగు శివ రూపమైన ఆత్మయే గలదు.

శ్లో॥ అహన్తా మలముత్సృజ్య నిర్వాణః ఖమివానలః।
సదేహమపదేహం వా జ్ఞస్తిష్ఠతి గతజ్వరః॥

తా॥ ఈ అహంభావమను మాలిన్యమును బూర్ణముగఁ ద్యజించి ఆకాశమువలె నిర్మలుడై మోక్షరూపుడై వెలయుజ్ఞాని దేహముతో గూడియున్నను, లేక దేహరహితుడైనను, సదా సంతాపవర్జితుడయ్యే వెలయును.

శ్లో॥ నిర్వాణైకతయా జ్ఞస్య వాసనైవ నవాసనా।
రేఖాదామోపమాత్వద్బేరూరాబ్ధ్యాది నజలేతరత్॥

తా॥ నిర్వాణరూపమగు ఆత్మతో ఏకత్వము నొందియుండుట చేతను, దగ్ధరజ్జువువలె బాధితమగుటచేతను, తరంగాదులు సముద్రజలము కంటె అన్యముకానట్లు, జ్ఞానియొక్క వాసనయున్ను ఆత్మకంటె వేఱు గాకయున్నది. గాన నది వాసన గానేరదు.

శ్లో॥ ఇష్టానిష్టోపలమ్భేషు శాన్తో వ్యవహరన్నపి।
శవవన్నాన్యతామ న్తర్నిర్వాణోఽనుభవత్యలమ్॥

తా॥ ఎవఁడు ఇష్టానిష్టముల సంప్రాప్తమందు శవమువలె శాంతచిత్తుఁడై సమముగ నుండునో, అట్టి జీవన్ముక్తుఁడు వ్యవహరించుచున్నను భిన్నత్వమునొకింతైనను దనయందనుభవింపకుండును.

శ్లో॥ అథవా శాన్తతైవాఽస్య నిర్వాణస్యావశిష్యతే।
నిర్వాసనః కిల మునిః కథం వ్యవహరత్యసౌ॥

తా॥ సప్తభూమికను బొందినట్టి జ్ఞానికి కేవలము శాంతత్వమే శేషించును ఏలయనగా వాసనారహితుఁడగు ఆ ముని ఎట్లు వ్యవహరింపఁగలఁడు?

శ్లో॥ యావత్తస్య న నిర్వాణం పరిపోషముపాగతమ్।
తావద్వ్యవహరత్యన్తరాగద్వేషభయోదయః॥

తా॥ సప్తభూమికాపర్యన్తము విశ్రాంతియొక్క దృఢత్వమెంతవరకు సంప్రాప్తింపలేదో, అంతవఱకు జ్ఞాని రాగద్వేష రహితుఁడై, సంసారోదయ వర్జితుఁడై, వ్యవహారము సల్పుచుండును.

శ్లో॥ వీతరాగ భయక్రోధో నిర్వాణశ్రాన్త మానసః।
శిలేవాప్యశిలీభూతో మునిస్తిష్ఠతి నిత్యశః॥

తా॥ తురీయపదమునుపొందిన మునీశ్వరుఁడు రాగద్వేష భయక్రోధవర్జితుఁడై, మోక్షరూపుఁడై, శాంతమనస్కుఁడై, నిత్యము శిలవలె నిశ్చలముగ నున్నను కేవలము చిద్రూపుఁడయ్యే వెలయును.

శ్లో॥ జీవితస్య యథా బాల్యం దృష్టం ప్రాథమకల్పికమ్।
నిర్వాణస్య తథా భోగసంత్యాగో రాగశాన్తిదః।

తా॥ ఆయువుయొక్క మొదటినియమము బాల్యావస్థయైనట్లు, రాగాదుల శమనమును గలుగఁజేయునట్టి భోగత్యాగము నిర్వాణముయొక్క ప్రథమనియమమై యున్నది.

శ్లో॥ అహం జగదిదం భ్రాన్తిః నాస్త్యేవ పరమేపదే।
ఇదం శాన్తమనాలమ్బం సర్వం నిర్వాణమవ్యయమ్॥

తా॥ శుద్ధమగు పరమపదమున అహంభావము యొక్కగాని, జగత్తుయొక్క గాని, ఇచ్ఛాదులయొక్కగాని, భ్రాన్తి లేనేలేదు. ఇది యంతయు సదాశాంతమై, నిరాధారమై, అవ్యయమై, నిర్వాణరూపమైనట్టి చిదాకాశమే అయియున్నది.

శ్లో॥ ఇచ్ఛామాత్రం హి సంసారో నిర్వాణం తదవేదనమ్।
ఇచ్ఛానుత్పాదనే యత్నః క్రియతాం కిం వృథాశ్రమైః॥

తా॥ ఓ రామచంద్రా! ఇచ్ఛామాత్రమే సంసారము. ఇచ్ఛయొక్క అభావమే నిర్వాణము. కాబట్టి ఇచ్ఛను నుత్పన్నము గాకుండ జేయుటయందే ప్రయత్నమాచరింపుము. తక్కిన వ్యర్థప్రయత్నములచే నేమిప్రయోజనము?

శ్లో॥ పరం విషయవైతృష్ణ్యం వజ్రధ్యానం ప్రసాధ్యతాం।
భేదే విగలితే జ్ఞానాదన్యధ్యాన తృణేన కిమ్॥

తా॥ ఓ రామచంద్రా! సంపూర్ణమగు విషయ తృష్ణారాహిత్యమున్ను, జ్ఞానముచే సమస్తభేదము నశించుటయు, వజ్రమువలె దృఢమైనట్టి యుత్తమధ్యాన మగును. అట్టి ధ్యానమునే సంపాదింప వలెను. తృణ సమానములగు ఇతర ధ్యానములచే నేమిప్రయోజనము?

శ్లో॥ ఉపాయఏకః శాస్త్రార్థో ద్వితీయో జ్ఞసమాగమః।
ధ్యానం తృతీయం నిర్వాణే శ్రేష్ఠస్తత్రోత్తరోత్తరః॥

తా॥ అట్టి బ్రహ్మమందు విశ్రాంతినొందుటకై, అనగా నిర్వాణప్రాప్తికై మొదటి యుపాయము అధ్యాత్మ శాస్త్రార్థములను నిరంతర మభ్యసించుట. రెండవది విజ్ఞులసహవాసము. మూడవది ధ్యానము. ఇందు ఉత్తరోత్తరముగా నొకదానికంటె నొకటి శ్రేష్ఠమై యొప్పుచున్నది.

శ్లో॥ చిత్రాగ్నినేవ బోధేన తేన జాడ్యం న శామ్యతి।
నిర్మూలాపి జగద్భ్రాన్తిర్యేనాశు నవిలీయతే॥

తా॥ చిత్రమందలి యగ్నిచే శీతలము నివారింపబడనట్లు, పైపై జ్ఞానముచే మూలాజ్ఞానమెన్నటికిని శమింపనేరదు. మఱియు నట్టి ఆపాతజ్ఞానముచే జగద్భ్రాన్తి శీఘ్రముగ నిర్మూలమైనట్లు తోచినను వాస్తవముగ నిర్మూలము కానిదే యగును.

శ్లో॥ శ్రుతపాఠ జపానేషు సమాధి నిరతోభవేత్।
సమాధి విరతః శ్రాంతః శ్రుతపాఠ జపాఞ్ఛ్రయేత్॥

తా॥ సాధకుండగువాడు వేదాంతశ్రవణము, ఉపనిషదాదుల పఠనము, ప్రణవాదులజపము మున్నగునవి గావించిన పిదప సమాధి

యందు తత్పరుండై యుండవలెను. సమాధినుండి లేచినపిదప, మరల యథావిధముగ శ్రవణపఠన జపాదుల గావింపవలయును.

శ్లో॥ బోధాత్మేషోఽన్తరాత్మైవ పరమః పరమేశ్వరః।
అస్యైవ వాచకోనామ ప్రణవో వేదసమ్మతః॥

తా॥ బోధరూపుఁడగు ఈయంతరాత్మయే ఉత్తముడగు పరమేశ్వరుఁడై యున్నాడు. వేదసమ్మతమగు ప్రణవమను నామమే యీతని వాచకమై యొప్పుచున్నది.

శ్లో॥ చిత్తంహి జీవన్ముక్తానాం నాస్త్యంకుర ఇవాత్మనామ్॥

తా॥ రాతినుండి అంకురము కలుగనటుల జీవన్ముక్తులకు చిత్తవృత్తులు లేవు.

శ్లో॥ పునర్జననయోగ్యాయా వాసనా ఘనవాసనా।
సాప్రోక్తా చిత్తశబ్దేన న సా తజ్జ్ఞస్య విద్యతే।

తా॥ మరల మరల యుత్పన్నమగునట్టి ఘనీభూతమగు వాసన యేదికలదో అదియే చిత్తశబ్దముచే చెప్పబడినది. అయ్యది జ్ఞానికి లేదు.

వేమన యోగీన్ద్రుడుగూడ నిర్వాణశబ్దమును ప్రయోగించి యున్నారు. నిర్వాణమనియు, నిర్వికల్పసమాధియనియు, బ్రహ్మసాక్షాత్కారమనియు, నిర్విషయమనియు, నిర్వాసమనియు ఒకే యర్థములోనే యుపయోగించియున్నారు. యోగవాసిష్ఠమును ప్రయోగించినది చూడుడు.

శ్లో॥ అగమ్యావచసాం శాన్తా సా సీమా భవభూమిషు।
కైశ్చిత్సాశివమిత్యుక్తా కైశ్చిద్బ్రహ్మేత్యుదాహృతా॥

శ్లో॥ కైశ్చిత్ప్రకృతిపుంభావ వివేక ఇతి భావితా।
అన్యైరప్యన్యథా నానాభేదై రాత్మ వికల్పితైః॥

తా॥ సప్తజ్ఞానభూమికలకెల్ల మెల్లమెల్లఁగొప్ప ప్రశాంతమగు యీ యేడవభూమిక వాక్కులకు విషయము కాసిదై యున్నది. కొందఱు దానిని శివమనియు, మఱికొందఱు బ్రహ్మమనియు చెప్పుదురు. ఇక కొందఱు ప్రకృతిపురుషుల యొక్కస్థితినిగూర్చిన వివేకమని భావింతురు. అట్లే తక్కినవారును నిజకల్పితములగు వివిధ భేదములచే స్వర్గమని, వైకుంఠమని, కైలాసమని, నిర్వాణమని, నిర్వికల్పసమాధియని, శివజీవైక్యమని, మోక్షమని పలువిధములుగ పేర్కొనుచున్నారు.

క॥ అతిసూక్ష్మదృష్టిలోనను మదికింపుగ
శివునిగూర్చి మఱియొకపైనన్।
ప్రతిలేని మోక్షమదియగు
సతతపు నిర్వాణపదవి సాక్ష్యము వేమా॥

తే॥ ఉన్ననిర్వాణ నిజచర్యగన్నవాడు
తన్నుతనలోన జూచెడి తత్త్వమెరిగి
సన్నుతించును బరమాత్మ సమతమతిని
గన్నుగన్ననివాఁడేమి గాంచు వేమా॥

ఆ॥ ప్రణవమెఱుగనతఁడు భక్తుండు కాఁడు
జ్యోతిజూడనతఁడు జోగిగాఁడు
నిత్యమెఱుగనతఁడు నిర్వాణికాడయా
విశ్వదాభిరామ వినుర వేమా॥

ఓమ్ తత్ సత్.

---

ఓమ్.

# నిర్వికల్ప సమాధి స్వరూపము.

ఈగ్రంథము కేవలము నిర్వాణపదమును గురించినదగుటచే సారాత్సారము, గుహ్యాద్గుహ్యము, గూఢాద్గూఢము మాత్రము ప్రతిపాదింపబడును. కావున నిర్వికల్పసమాధియొక్క స్వరూపము మాత్రమే ఇచ్చోట నిర్ణీతమగును. తక్కిన యమాది ధ్యానమువరకుగల ఏడంగములున్ను ఇదివరలో వ్రాయబడిన గ్రంథములలో తెలుపబడినవగుటచే నిచ్చట నిరూపింపబడవు. ఆ ఏడంగములు ఓంకారగ్రంథాలలో ముముక్షువులు చూచుకొనవచ్చును. యథార్థముగా చెప్పిన నిర్వికల్పసమాధియు, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమున్ను ఒక్కటియే. ఇవి రెండున్ను వస్త్రమునకు పడుగుపేకలవలె సంబంధపడి యుంటున్నవి. ఒక్కదానిని విడచి ఇంకొక్కటి శోభించుటలేదు. దీపప్రకాశము వంటిది ఆ జ్ఞానమనియు, ఆదీపమును సంరక్షించుటకు చిమ్నీ యెటువంటిదో, అదియే యోగమనియు

గ్రహించుకొనవలయు. దీపప్రకాశముచేతనే రాత్రికాలమున గృహాన్త రాళములోగల తమస్సుతొలగుటకున్ను, వస్తువులన్నియు లెస్సగాగోచరించుటకున్ను కారణమగును. అయితే చిమ్నియొకటిలేనిచో గాలిచే దీపముచలించవచ్చును; లేక ఆరిపోవచ్చును. అయితే చిమ్నిమాత్రముండి దీపకాన్తి లేకపోయిన చీకటి తొలగదు; వస్తువున్ను కనుపించదు. కావుననే యోగకర్తలున్ను, జ్ఞానకర్తలున్ను యీలాగున వచించుటకు కారణమయినది.

శ్లో॥ యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతీహ భోః।
యోగోఽపి జ్ఞానహీనస్తు నక్షమో మోక్షకర్మణి॥
తస్మాజ్జ్ఞానం చ యోగంచ ముముక్షుర్దృఢమభ్యసేత్॥

తా॥ ఇదియొక మహాత్ముని దగ్గఱకు ఒకముముక్షువు వెళ్ళి అడిగిన ప్రశ్నగాయున్నది. ఓ ప్రభువా! ఈలోకమున అష్టాంగ యోగానుష్ఠానములేనివానికి మోక్షమును గలిగించెడు జ్ఞానమెటుల సిద్ధించును? అలాగున ఆధ్యాత్మజ్ఞానము లేనివానికి వట్టి యోగసాధనమాత్రము మోక్షమందు, అనగా, ఆత్మజ్ఞానమందు ఎటుల సమర్థతగలుగును? దీనికి సమాధానముగ ఆఋషి ఇటుల వచించెను. ఓసౌమ్యుడా! నీవుచెప్పిన రెండుకారణములవల్ల యోగసిద్ధిగాని, జ్ఞానసిద్ధిగాని గలుగవలసియుండినచో, ముముక్షువైనవాడు రెండింటిని తప్పక అభ్యసింపవలయు. అయితే ఆధ్యాత్మికజ్ఞానమొకటియే ముక్తి గలుగజేయునని శాస్త్రనిర్ణయము. అయితే అట్టి ఆత్మజ్ఞానము గలుగుటకున్ను, అది నిరావరణముగా ప్రకాశించుటకున్ను, ఇంద్రియములనుండి విలక్షణముగా వెలుగుటకున్ను కొంత యోగసాధన అందరికిని ఆవశ్యకము. అంతియే చాలును. అణిమాది సిద్ధులకొఱకు చేయవలసిన కఠినసాధనములగు యోగములు అంత అవసరములు కావు. ఇంతమాత్రము యోగానుష్ఠానము పరమ ఋషులకండఱికిని కనుపడుచున్నది. వర్తమానయుగములోయుండిన శ్రీ శంకర రామానుజ మధ్వాచార్యులవార్లకున్ను, శ్రీనారాయణగురు దయానంద రామకృష్ణ వివేకానంద రామతీర్థాదులకున్ను గలిగియున్నట్లు వారిచరిత్రము తెల్పుచున్నది. ఇంద్రియముల నిరోధము గల్గి ద్వంద్వముల సహించి బ్రహ్మోఽస్మియను స్థితిలో నిలుచుటకు

యోగానుష్ఠానము యెంతయో సహాయపడును. అది యోగశాస్త్రములో చెప్పబడిన షట్క్రియలతో సంబంధములేదు. యమనియమములుతప్పక అందఱికి యుండవలయును. అవి ఆచరణమాత్రమును తెల్పుచుండును. మరల ముఖ్యముగుకొన్ని సిద్ధాభ్యాసనాదులున్ను, కొంతప్రాణాయామమున్ను యుండినచాలును. బ్రహ్మచర్యము, తపస్సు, భగవద్భక్తి అందఱికిన్ని సమానముగానే యుండవలయును. దీనిపై ప్రత్యాహార ధారణ ధ్యానములు అభ్యసించిన, గాలిలేని ప్రదేశములో నిశ్చలముగా వెలుగుచుండు దీపమువలె స్వరూపసాక్షాత్కార జ్ఞానజ్యోతి వెలుగుచుండును. బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమున్ను, నిర్వికల్పసమాధి యోగసిద్ధియున్ను ఒకటియేయని ఇదివరలో తెల్పడమైనది. అట్టి నిర్వికల్పసమాధినిపొందినవారికిని, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గల్గినవారికిని మరల సంస్కారగుర్తులుగాని, దృశ్యవాసనలుగాని, విషయగుణములుగాని, త్రిగుణములుగాని యుండునా ? లేదా ? అను విషయమునే యీగ్రంథము నిర్ణయించచూనినది. దీనియొక్క నిర్ణయము సామాన్యజనులకు తెలిసికొనుటకు తగినగ్రంథములు స్వభాషలో లేనందుచే సందేహపడుచున్నారు. మీలో చాలామందిన్ని అగ్నిహోత్రమును చూచియున్నారు. దానియందు హోత నవధాన్యములను నవవిధసమిధలను ఘృతముతో సహా హోమించును. అతడు ఏకాగ్రతతో అగ్నియొక్క సప్తజిహ్వాలను కనిపెట్టి హోమించినయెడల ఆ ధాన్యములు, సమిధలు అన్నియు భస్మములై పోవును. అట్లు అప్రమత్తుడై హవనక్రియ జరుపకపోయిన, బహిర్దృష్టిగలవాడై చేసినయెడల, నవవిధధాన్యములలో కొన్ని అగ్నిలోపడక అచ్చటచ్చట పడియుండిన, ఆభస్మమును పడవైచిన, వానకురియునప్పుడు భస్మముకాని విత్తనములన్నియు మొలకలెత్తును. బీజములు దహింపబడకుండుటకు యిదియే దృష్టాంతము. ఆలాగు ఆత్మయజ్ఞమును గురించికూడ ఋషులు తెల్పియున్నారు. చిత్తనిరోధముగల్గి ధ్యేయాకారమగు జ్ఞేయవస్తువులలో నిలుకడగల్గి యోగియైననుసరి లేక ఆత్మజ్ఞానియైననుసరి వారికి మరల సంస్కారములనియెడు బీజములుగాని, కర్మమనెడు కట్టెలుగాని భస్మములై పోవును. అట్లు కానివారికి మరల సంస్కారములు, వాసనలు, గుణములు గల్గియుండును. వేగని విత్తన

ములు అంకురించునట్లు సంస్కార శేషము గలవారందఱికిని పునర్జన్మము గలుగుట నిక్కము. ఈసత్యమే ఇచ్చట తెలుపబడును.

శ్లో॥ ఊర్ధ్వ పూర్ణమధః పూర్ణః మధ్యపూర్ణం శివాత్మకమ్।
సాక్షాద్విధిముఖోహ్యేష సన్సమాధిః పారమార్థికః ॥

తా॥ మీదను, క్రిందను, నడుమను, నిండియున్నట్టి సర్వపరిపూర్ణ బ్రహ్మాకారదశయే శాస్త్ర సిద్ధమైన విధిరూప సమాధి యగును. దీనికి అంతయు విష్ణుమయమనిగాని, శివమయమని బ్రహ్మమయమని గాని చెప్పెడుదివ్యవాక్యములు. ఇదిభక్తియోగమునకును, ధ్యానయోగమునకును, జ్ఞానయోగమునకును సంబంధించిన పరమార్థసత్యమని నమ్మదగినది. నిష్కామకర్మయోగము పైజెప్పిన మూడుయోగములలోను అంతర్భూతములు. అత్తఱి తన యుపాస్య దైవస్వరూపమునకు అన్యముగా మఱియేమియు యుండగూడదు. ఉండిన దృశ్యవిలయము కాలేదు. దృశ్యవిలయము కానిచో త్రిపుటి రహితముకాదు. త్రిపుటి రహితము కానిచో దృక్దృశ్య దర్శనములు గల్గియుండును. అది పరిపూర్ణజ్ఞానము గాదు. అపరిపూర్ణ జ్ఞానమే యగును. కావుననే ఈ శ్లోకమున "ఊర్ధ్వపూర్ణమధః పూర్ణః మధ్య పూర్ణం శివాత్మకమ్" అని ప్రయోగించుటకు కారణము. అనగా ఆదిమధ్యాన్త భేదములేక, ఒకేశివస్వరూపముగా అనుభవము గలుగవలయును. ఇట్టి అవస్థయే సాక్షాత్ వేదముఖమునుండి యేర్పడిన పరమార్థ సమాధియగును. అయితే ముముక్షువులకు, సాధకులకు, జిజ్ఞాసువులకు, అభ్యాసులకు భక్తులకు అన్నిగుణములు నశించియుండవు. అట్టిఅర్థము అభ్యాసి జిజ్ఞాసువు, ముముక్షువు, సాధకుడు అను శబ్దములో వ్యక్తమగుచున్నది అట్టి స్థితిలోయుండు అధికజనులున్ను, తమ్ములను జీవన్ముక్తు మనియు, బ్రహ్మసాక్షాత్కారము పొందినవారల మనియు, నిర్వికల్ప సమాధి సిద్ధించినవార మనియు, విదేహముక్తుల మనియు తలంచుట చేతనే, యీ పొరబాట్లన్నియు గలుగుచున్నవి. దానికి కారణముగూడ గలదు. అదేమన, వర్తమాన యుగములో నిర్వికల్పసమాధి పొందిన యోగిగాని, బ్రహ్మసాక్షాత్కారము గల్గిన ఆత్మజ్ఞానిగాని, పరమ ఏకా భక్తిగల్గిన భక్తుడుగాని అరుదు అయినందుచేత, అట్టివారిని చూప

చెప్పుటకు మనకు లేకపోయెను. ఒకవేళ ఒకరిద్దఱు యుండినను, విస్తారముగా లేకపోవుటచేత మనకు సాక్షిగా నిరూపణముచేయుటకు అవకాశము లేకపోయెను.

శ్లో॥ ప్రశాంతవృత్తికంచిత్తం పరమానంద దీపకమ్।
అసంప్రజ్ఞాతనామాఽయం సమాధిర్యోగినాం ప్రియః॥

తా॥ ఎప్పుడు మనస్సు ప్రశాంతమై, బ్రహ్మాకార వృత్తిగలదై, ప్రకాశకమై యుంటున్నదో అప్పుడు ఆ సమాధి యోగనిష్ఠులకు ప్రియమైన అసంప్రజ్ఞాత సమాధియను పేరుగలది యగుచున్నది. దీనియందు "ప్రశాంతవృత్తికంచిత్తం" అనిచెప్పుటచే ప్రకృతి వృత్తులు సంపూర్ణముగానశించినదై శుద్ధమైనదని గ్రహించుకొనవలయును. సమాధిలో నిర్వికల్పసమాధి యనియు, సవికల్పసమాధి యనియు, నిర్బీజసమాధి యనియు, సబీజసమాధి యనియు, సాలంబసమాధి యనియు, నిరాలంబ సమాధియనియు అని కొన్ని పేర్లుగలవు; అవస్థలును గలవు. ఇచ్చట నిర్వికల్ప నిర్బీజ నిరాలంబ సమాధులను మాత్రము గ్రహించబడినవి. అదియే పరమకాష్ఠ; పునరావృత్తిరహితమగు కైవల్యము. తక్కినవి పునర్జన్మమును గలుగజేయును. అయినను యుత్తమలోక ప్రాప్తియు, మరలయుత్తమోత్తమ జన్మమును వీరికిగలును.

శ్లో॥ ధ్యాతృధ్యానే సంవిహాయ నివాతస్థిత దీపవత్।
ధ్యేయైకగోచరం చిత్తం సమాధిరభిధీయతే॥

తా॥ ధ్యానము, ధ్యాతయను వృత్తిలేక ధ్యేయమైన బ్రహ్మస్వరూపమొందిన చిత్తమే సమాధి. భ్రమరకీటకన్యాయమున ధ్యానింపగా ధ్యాతయే ధ్యేయాకారమగు బ్రహ్మాకారమొందును. అదియే సమాధి యనబడును.

ఇచట శ్రవణ, మనన, నిదిధ్యాసములనుగూడ త్యజించి సాక్షాత్కారస్థితియే నిరూపింపబడినది. బీజము అంకురించి వృక్షమగునటుల, ఆబీజమే వృక్షాకారమై మారునటుల, నిదిధ్యాసన సుస్థిరమగునప్పుడు బ్రహ్మాకారమై మారుచుండును. అగుచో సమాధియనియు, వ్యుత్థానమనియు చెప్పునదంతయు సామాన్యబుద్ధిగలవారికి గ్రహణకొఱకు అని తెలిసికొనవలయును. అట్లుకానిచో సామాన్యజనులు అనుష్ఠింపజాలరు.

బుద్ధికిని భ్రమగలుగును. నిజముగాచెప్పిన ఆత్మయందు ధారణధ్యాన సమాధులుగాని, వ్యుత్థానములుగాని లేదు. అవన్నియు అంతఃకరణము యొక్కయు, మనస్సుయొక్కయు, బుద్ధియొక్కయు సంకోచవికాసములే గాని, 'హృదయముయొక్క ధర్మములుగాని,' ఆత్మధర్మముగాదు. ఆత్మ యెల్లప్పుడునుస్వప్రకాశమై, నిరావరణమై, జననమరణధర్మములులేనిదై, సనాతనమై, స్వయంజ్ఞాన స్వరూపమై యుంటున్నదే యగును. చిన్నపిల్ల వారికి యేదైన ఒకలెక్కను గుణింపమని చెప్పునప్పుడు వ్రేళ్లచే లెక్క పెట్టించునటుల, మనోబుద్ధీంద్రియముల కతీతమై వెలుగుచుండు ఆత్మను బోధించునప్పుడు సామాన్యజనులకు అగ్రాహ్యమగుటచే మనస్సు శుద్ధ మగుటకున్ను, ఏకాగ్రతగల్గుటకున్ను యీ ధర్మములన్నిటిని శాస్త్రము తెలుపుచున్నది. కావుననే ఈలాటిస్థలములలో మోక్షోపాయమని వచించుటకు కారణమైనది. ఉపాయమనగా నేరులో గ్రహింప శక్తిలేని వారికి మఱియొకప్రకారముగా చెప్పుటయని అర్థము. అదెట్టిది అనగా, చిన్నపిల్లవార్లకు విషజ్వరమువచ్చునప్పుడు చేదుమాత్రను యివ్వవలసి వచ్చిన బెల్లములోపల ఔషధమునుపెట్టి మందుపేరుచెప్పక బెల్లము పేరుచెప్పేలాగునయుండును. అట్లుగాక ఇది విషజ్వరము; అదిగో చేదు మాత్ర; దీనినిభుజించిన రోగశాంతిగలుగునని చెప్పినచో ఆ బాలుడు భుజించునా? శాస్త్రములలో యీలాటి ధర్మములు కొన్ని అంగీకరింప బడియున్నవి. దీనికి గుడౌషధన్యాయమని పేరు.

శ్లో॥ నైతజ్జాగ్రన్నచస్వప్నం సంకల్పానామ భావనాత్।
సుషుప్తి భావో నాప్యేతదభావాజ్జడతాస్థితేః॥

తా॥ బ్రహ్మాకారముగా మనస్సు పరిణమించుటచే, నితరసంకల్పములు లేకయుండుటచే సమాధి స్వప్నావస్థకాదు. దృశ్యముస్ఫురింపనందుచేత జాగ్రదవస్థగాదు. సుషుప్తియగు జడత్వము కానందుచేత నిద్రావస్థగాదు. కేవలతురీయమై జాగ్రత్స్వప్న సుషుప్తి మూర్ఛాద్యవస్థలకు విలక్షణమైయున్నది.

శ్లో॥ సత్త్వావబోధఏవాసౌ వాసనా తృణపావకః।
ప్రోక్తస్సమాధిశబ్దేన నతు తూష్ణీమవస్థితిః॥

తా॥ అసత్యములైన జగజ్జీవేశ్వరాదిభేదమును నిరసించి సత్యమైన బ్రహ్మజ్ఞానము నెఱుంగుట సత్త్వావబోధము. సత్త్వమనగా సద్ధర్మము. తానే బ్రహ్మమని, యితరమెద్దియు లేదని యెఱుగుట యనెడు నీ సత్త్వావబోధము సమాధియగును.

ఇది సమస్తవాసనలనెడు తృణములకు ప్రజ్జ్వలితమైన అగ్నివంటి దగుటచేత వాసనలను నశింపజేయును. జాగ్రత్స్వప్న సుషుప్తులును, ఆలస్యము మొదలయినవానివలన నూరకయుండుటయును సమాధి కాదు. శరీరమును మఱచుటయు సమాధికాదు. కర్తృత్వాద్యభిమానములేక తానే బ్రహ్మమని నిశ్చయించుట సమాధి. కొన్నిరోగములచే యేమియును తెలియకపోవుట సమాధికాదు. ఇంద్రియనిరోధముచే వృత్తులడంగియుండుటయు సమాధికాదు. కావుననే "సత్త్వావబోధఏవాసౌ వాసనాతృణపావకః" అనిమూలములో ప్రయోగించుటకు కారణము. ఆత్మతత్త్వావబోధము గలిగియుండుట సమాధియనియు, అది వృత్తులు, సంస్కారములు, వాసనలు అనెడి శుష్కతృణములకు, శుష్కపత్రములకు వూడ్చి కుప్పవేసిన కుప్పలకు, మహాప్రజ్జ్వలించెడు అగ్నియనివర్ణించుటకు హేతువైనది. దీనివల్ల వృత్తులు, గుణములు, సంస్కారములు, సమాధినిష్ఠగల, బ్రహ్మసాక్షాత్కారముగల మహాత్ముల యెడ యుండవని తెలిసికొనవలయును. వసంతకాలి మధ్యాహ్నప్రకాశ సూర్యుని చీకటేలాగున ఆవరింపజాలదో, ఆలాగునహృదయాకాశమున నిరావరణ ఆత్మప్రబోధభాస్కరుడు ఉదయించియుండు ఋషివంటి వారును ప్రకృతి ఆవరింపజాలదు.

శ్లో॥ బహువ్యాకులచిత్తానాం విచారే తత్త్వధీర్నహి।
యోగో ముఖ్యః తతస్తేషాం ధీదర్పస్తేన నశ్యతి॥

తా॥ అనేక విషయములలో చంచల స్వభావముగలవారికి మహావాక్య విచారణయందు బుద్ధికి ప్రవేశముగలుగదు. వీరికి యోగసాధన ముఖ్యము. దానిచే మనోబుద్ధ్యాదుల చలనము నశించును. ఇదియే యోగశాస్త్రముయొక్క రహస్యము.

శ్లో॥ స్వానుభూతిరసావేశాద్దృశ్యశబ్దానపేక్షితః।
నిర్వికల్ప సమాధిస్స్యాన్నివాతస్థిత దీపవత్॥

తా॥ స్వానుభవమయిన యానందముతో గూడినదియును, దృశ్యము, శబ్దము అనురెండు(సవికల్ప) సమాధులను అపేక్షింపనిది యును, గాలిలేని స్థలమందుంచిన దీపమువలె నిశ్చలమైనదియును అయినట్టి ఆత్మస్వరూపస్థితియందే నిలుకడగలిగియుండుటయే నిర్వికల్ప సమాధి యగును.

శ్లో॥ యత్సమత్వం తయోరత్ర జీవాత్మపరమాత్మనోః।
సమస్త నష్టసంకల్పః సమాధిరభిధీయతే॥

తా॥ ఎప్పుడు జీవాత్మపరమాత్మలకు ఐక్యము (సమత్వము) కలుగుచున్నదో, అప్పుడు సకలసంకల్పములును నశించిపోవుచున్నవి. అట్టి జీవాత్మపరమాత్మల ఐక్యమే సమాధియని చెప్పబడుచున్నది. ఇచ్చట జీవాత్మపరమాత్మల ఐక్యమని యోగశాస్త్రరీతిగాను, పరమాత్మ యందు జీవాత్మకల్పితమని తెలిసికొనుటయే ఐక్యశబ్దార్థమని జ్ఞాన శాస్త్రరీతిగాను తెలిసికొనవలయును.

శ్లో॥ సలిలే సైంధవం యద్వత్ సామ్యం భవతి యోగతః।
తథాఽఽత్మ మనసోరైక్యం సమాధిరభిధీయతే॥

తా॥ ఏ ప్రకారముగా నీటియందు ఉప్పుకరిగి (జలమయమై) సామ్యమునొందినదగుచున్నదో, అట్లు మనస్సున్ను ఆత్మలోలీనమై ఆత్మ మయమై యుండుటయే సమాధియని చెప్పబడుచున్నది. ఇచ్చట మనోలయము యోగశాస్త్రానుసారముగను, ఆత్మవిచారణచే వృత్తులు, సంస్కారములు నశించునప్పుడు మనస్సనునది మరియొకటి లేదని అను భవము గలుగుటయే జ్ఞానశాస్త్రానుసారముగను గ్రహించుకొనవల యును. అయితే మనస్సులేనిచో ఆత్మజ్ఞానులు యెట్లు వ్యవహారమును జరుపగలరని సందేహింప నవసరములేదు. వారి మనస్సు వృత్తిరహితమై దగ్ధపటన్యాయముగా యుండును. అట్టి చిత్తమునకు చిత్తమని పేరులేదు. సత్త్వమనియే వ్యవహరింతురు. యోగవాసిష్ఠమున దీనిని విస్తారముగా కనందగును. ఇప్పుడు శ్రీ భగవద్గీతలో చెప్పిన విషయమును తెలిపెద. దీనిచే బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముగలవారికి కర్మలుగాని, సంస్కార ములుగాని యుండవని మీరు తెలిసికొనగలరు. ఓమ్.

గీత. అ. 41. శ్లో॥ 37.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥

తా॥ ఓ యర్జునుడా! లెస్సగా మండుచున్న యగ్ని కట్టెలను ఏలాగున సంపూర్ణముగా భస్మముచేయునో, ఆలాగుననే జ్ఞానమనెడి యగ్ని సర్వకర్మలను సంపూర్ణముగా భస్మముచేయును.

వి॥ దీనివల్ల జ్ఞానాగ్ని ప్రజ్వలించిన సర్వకర్మలు, సంస్కారములు, వాసనలు భస్మములగునని గోచరించుచున్నది.

శ్లో॥ యథా వహ్నిర్మహా దీప్తశ్శుష్కమార్ద్రంచ నిర్దహేత్।
తథా శుభాశుభంకర్మ జ్ఞానాగ్నిర్దహతి క్షణాత్॥

తా॥ ఏలాగున గొప్పగా వెలుగుచుండు అగ్నిహోత్రుడు ఎండినట్టియు, ఎండనట్టియు కట్టెలను దహింపచేయుచున్నాడో, ఆలాగున జ్ఞానాగ్ని ప్రజ్వలించిన శుభాశుభ కర్మలన్నిటిని త్వరలోనే భస్మమొనర్చును.

శ్లో॥ యథా భర్జితబీజస్య ప్రరోహిత్వం వినశ్యతి।
తథాఽఽత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధిర్విలీయతే॥

తా॥ ఏలాగున వేయించబడిన వి త్తనముయొక్క అంకురము నశించియుండునో, ఆలాగున ఆత్మజ్ఞానముదయించిన జ్ఞానియొక్క దృశ్యగుణములు నశించియుండును. అదియే జ్ఞానముగలిగినందులకు గుఱుతు.

శ్లో॥ అగ్నిసంగాద్యథాలోహమగ్నిత్వమధిగచ్ఛతి।
ఆత్మసఙ్గాత్తథా గచ్ఛత్యాత్మతామింద్రియాదికమ్॥

తా॥ కొలిమిలోపెట్టి ఊదుచున్న లోహములన్నియు యేలాగున అగ్నిమయములై పోవునో, ఆలాగున ఆత్మజ్ఞానాగ్ని ప్రజ్వలించిన మహాత్ముని మనస్సు, బుద్ధి మొదలగు ఇంద్రియములన్నియు ఆత్మమయములై యుండును. కావుననే ఆత్మజ్ఞానుల ఇంద్రియములుగూడ ఆత్మమయములై యుండునని చెప్పెడు రహస్యము.

శ్లో॥ బీజాన్యగ్న్యుపదగ్ధాని న రోహన్తి యథా పునః।
జ్ఞాన దగ్ధైస్తథా క్లేశైర్నాత్మా సంబధ్యతే పునః॥

తా॥ అగ్నియందు దహించబడిన బీజములు మరల యేలాగున మొలకలెత్తవో, ఆలాగున జ్ఞానాగ్నియందు దగ్ధమైన హృదయములో కర్మక్లేశములన్నియు నశించియుండును. ఇదియే జ్ఞానముదయించిన దానికి గుర్తు.

శ్లో॥ యథా పర్వతమాదీప్తం నాశ్రయన్తి మృగద్విజాః।
తద్వద్బ్రహ్మవిదోదోషా నాశ్రయన్తి కదాచన॥

తా॥ ఏలాగున కాలుచున్న పర్వతమును మృగములుగాని, పక్షులుగాని చేరవో, ఆలాగున బ్రహ్మాత్మజ్ఞానము వెలుగుచుండు మహానీయాత్ముని ప్రాకృతగుణములు జేరవు. కొండలు కాలునప్పుడు దానిలో గల మృగపక్ష్యాదులు పారిపోవుటయేగాక ఇతరములున్ను ఎట్లు చేరవో, ఆచొప్పున జ్ఞానాగ్నిరగులుచున్న హృదయములో ఇదివరకు ఆశ్రయించియుండు ప్రాకృతగుణములు నశించినవే గాక క్రొత్తగుణములున్ను చేరవు.

శ్లో॥ అగ్నావపద్ఘృతం సర్వమగ్నిరేవ భవేద్యథా।
విదితం విదితం వేద్యం సంవిదేవ భవేత్తథా॥

శ్లో॥ కర్పూరో దీపసంసర్గాద్దీపఏవ భవేద్యథా।
వేద్యవేదన సంసర్గాత్సంవిదేవ భవేత్తథా॥

శ్లో॥ సంవిదితం సంవిదితం సచిన్మయైవ భవతి సంవేద్యమ్।
అగ్నావాహితమాహితమగ్నిమయం కిం నజాయతే కాష్ఠమ్॥

తా॥ అగ్నియందు హోమముచేయఁబడిన నేయి యంతయు నెట్లగ్నియే యగునో, అట్లు తెలియఁదగిన స్వస్వరూపజ్ఞానానుభవము గలుగగా గలుగగా జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునే పొందును. కర్పూరము దీపముసంబంధమువలన నెట్లుదీపమగునో, అట్లే తెలియఁదగిన బ్రహ్మస్వరూపజ్ఞానానుభవమువలన జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునే పొందును.

అగ్నియందుఁ గట్టెలనువేసి కొంతసేపుంచిన నెట్లు క్రమముగానవి యగ్నియగునో, అట్లు స్వస్వరూపమును గురూపదేశప్రకారము భావింప భావింప జ్ఞానస్వరూపియగు తానే బ్రహ్మము (తాను) అగును.

వి॥ బ్రహ్మనిష్ఠులారా! దీనికన్న ఇంక పరమప్రమాణము మీాకేది కావలయును? హోమగుండము మండకయుండిన మాత్రము గదా నవ

ధాన్యాదులు బూడిదగాకయుందునుి? అలాగున హృదయ వేదికయందు బ్రహ్మజ్ఞానాగ్ని వెలుగనివారి హృదయమున ప్రకృతి గుణములుయుండు నని యిప్పుడైనా మీరు ఏల తెలిసికొన కూడదు?

శ్లో॥ సంసారజసుఖాసక్తం బ్రహ్మజ్ఞోఽస్మీతి వాదినమ్।
కర్మబ్రహ్మోభయభ్రష్టం తం త్యజేదన్త్యజం యథా॥

తా॥ సంసారసంబంధ విషయ సుఖములతో కూడినవాడై యుండి ఎవడైతే నేను బ్రహ్మజ్ఞుడని వచించునో అట్టివానిని కర్మమందును, బ్రహ్మమందును భ్రష్టునిగా తలంచవలయును. అట్టివానిని యజ్ఞకార్యములలో అన్త్యజునివలె త్యజించవలయును. కర్మకాండశాస్త్రమును అనుసరించక పోవుటవలనను, జ్ఞానశాస్త్రములో చెప్పినటులాచరింపక పోవుటచేతను కర్మబ్రహ్మోభయభ్రష్టుడని అట్టివానిని గుఱించి శాస్త్రము తెలుపుచున్నది.

శ్లో॥ అకృత్వా వృత్తివిలయమజ్ఞాత్వా బ్రహ్మ కేవలం।
అహంబ్రహ్మేతి యో బ్రూతే తస్య జిహ్వాం వికర్తయేత్॥

తా॥ అన్తఃకరణములో వృత్తులన్నింటిని విలయమునొందించకయు, సాక్షాద్బ్రహ్మమును అనుభవము చేసికొనకయు ఎవడైతే నేను బ్రహ్మమయితినని చెప్పునో, అట్టివాని జిహ్వాచ్ఛేదనమును చేయవలయునని శ్రీశంకరాచార్యులు వచించిరి.

శ్లో॥ ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః।
తైరేవతు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః॥

తా॥ జీవాత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు, సాక్షియనియు, ప్రకృతి సంబంధ త్రిగుణములతో కూడియుండునంతమాత్రమే చెప్పబడును. ప్రాకృతములగు త్రిగుణములనుండి విముక్తినిపొందినప్పుడు పరమాత్మయని వ్యవహరింపబడును. ఇదియే జీవాత్మపరమాత్మలకు గల భేదమని విజ్ఞులు తెలిసికొనవలయును.

శ్లో॥ త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః।
సపూజ్యస్సర్వభూతానాం వన్ద్యశ్చైవ మహామునిః॥

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్తియనెడు మూడవస్థలకు సాక్షి సమానముగా యే ఆత్మగలదో, దానిని నిశ్చయముగా నెఱింగినవాడెవడో, ఆ మహాత్ముడు సర్వులకును పూజ్యుడు, సర్వప్రాణులలోను

ఆతడధికుఁడు, అతడందఱిచేతను వంద్యుడు. అతఁడే మహాముని యు అని తెలియందగినది.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చండాల ఏవచ।
దృఢాభ్యాసకరో నిత్యం పునర్జన్మ నవిన్దతి॥

తా॥ బ్రాహ్మణుడైనను, క్షత్రియుడైనను, వైశ్యుడైనను, శూద్రుడైనను, అంత్యజుడైనను బ్రహ్మాభ్యాసమునందు దృఢత్వముగల్గి యుండిన అతడు ముక్తుడే. అతనికి పునర్జన్మము లేదు.

శ్లో॥ ఉత్పన్నాత్మావబోధస్య అద్వేష్టృత్వాదయో గుణాః।
అయత్నతో భవన్త్యస్య నతు సాధనరూపిణః॥

తా॥ ఎవనికైతే ఆత్మజ్ఞానోదయము గలుగునో, అట్టి పుణ్యాత్మునకు భగవద్గీత పంౘెండవాధ్యాయమున చెప్పిన పరమ భక్తులకు గలుగు అద్వేష్టృత్వాది గుణములన్నియు యత్నములేకనే సంభవించును. ప్రత్యేకముగా వాడు దానికొఱకు ఏ సాధనయు చేయనవసరము లేదు. అనగా సాధకునకు అనుష్ఠానరూపముగాను, ముక్తాత్మునకు అవి స్వాయముగాను యుండునని భావము. కావున తమను ఎవరు ముక్తులని తలంచుచున్నారో అతనికి అద్వేష్టృత్వాది గుణములు సంపూర్ణముగా గలిగి యుండునని భావము. దీనిని గీతలో 12-వ అధ్యాయములో కానగును.

శ్లో॥ అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢం భవేత్।
శమాది సహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥

తా॥ మహావాక్యార్థబోధము సుదృఢముగా ఎంతవరకు గలుగలేదో, అంతవఱకు శమదమాదులతో కూడినవాడై శ్రవణ, మనన, నిదిధ్యాసములను తప్పక చేయవలయును. గురుముఖమునుండి శ్రవణము చేయబడిన అహంబ్రహ్మేతి మహావాక్యార్థముయొక్క దృఢము గలుగువరకు శమాదులతోగూడిన యభ్యాసము చేయవలయును. రోగియగువాఁడు సంపూర్ణారోగ్యము గలుగువరకు ఉత్తమ పథ్యముతో ఔషధసేవను చేయవలయును గదా.

సమాధినిగుఱించి శ్రీ పతఞ్జలిమహర్షి నిర్ణయమును నిరూపించెద.

సూ॥ తదేవార్థమాత్రానిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః।

తా॥ ధ్యానము నిరన్తరాభ్యాసవశమున ధ్యేయాకారమున పరిణమించి తన ధ్యానరూపమును తోపనీయక, నీటిలోబడిన లవణము నీరుగా పరిణమించి లవణాకారమును గనుపడనీని చందమున నుండునేని, యట్టి యవస్థయే సమాధి యనబడును.

కాని ధ్యానమునందు ధ్యాతృధ్యానధ్యేయములు గలిసిన త్రిపుటి భాసించును. సమాధి యందన్ననో, ధ్యేయముమాత్రము భాసించును. ఇంతమాత్రమే ధ్యానసమాధులకు భేదము.

ఇది, బీజము వృక్షమై పరిణమించునప్పుడు బీజము శూన్యమగునట్లు యుండును. ఈ విషయమై కొన్ని సంప్రదాయస్థులు ఎఱుక నశించవలయుననియు, అదియే పరిపూర్ణమనియు వచింతురు. దీనినే కొందఱు ఆఖరున శూన్యమే మిగులుచున్నదనియు, అదియే నిర్వాణమనియు నుడువుదురు. ఇచ్చట అన్తఃకరణ ప్రతిబింబ చిదాభాసుని శూన్యమే శూన్యశబ్దమునకు అర్థమని గ్రహించుకొనవలయును. కావుననే ఇదివరలో తెలిపిన మూల సూత్రములో

శ్లో॥ ధ్యాతృధ్యానే సంవిహాయ నివాతస్థిత దీపవత్।
ధ్యేయైకగోచరం చిత్తం సమాధిరభిధీయతే॥

అని వర్ణించడమైనది. కావుననే సూతసంహితయందు సనకాది ఋషులకు మహేశ్వరుండిటులుపదేశించుటకు కారణము.

శ్లో॥ సమాధి నిర్ధూత మలస్యచేతసో నివేశితస్యాత్మని యత్సుఖంభవేత్।
నశక్యతే వర్ణయితుం గిరాతదా స్వయం తదన్తఃకరణేన గృహ్యతే॥

తా॥ సమాధిచేత చక్కగా శుద్ధము చేయబడినదియును, ఆత్మయందుంచబడినదియును అగు మనస్సునకు యే బ్రహ్మసుఖము గలుగుచున్నదో, దానిని వాక్కుచే చెప్పుటకు సాధ్యముగాదు. అనుభవముచేతనే గ్రహింపనగును.

శ్లో॥ అర్థమాత్రంతు యద్గ్రాహ్యం చిత్తమాదాయ పార్థివ।
అర్థస్వరూపవద్భాతి సమాధిస్సోఽభిధీయతే॥

తా॥ చిత్తమును సమాధానము పరచుకొని ప్రణవార్థ పరబ్రహ్మమును మాత్రము గ్రహించునదై, ప్రణవార్థస్వరూపమై ప్రకాశించెడు స్థితి యేదిగలదో, అదియే సమాధి యనబడును.

సూ॥ త్రయమేకత్ర సంయమః॥

తా॥ ఏకవిషయకమగు ధారణాధ్యానసమాధులు మూడును కలసి యోగశాస్త్ర పరిభాషచే సంయమమని వ్యవహరింపబడును. అనగా నేవిషయమున ధారణయొనర్పబడునో యావిషయముననే ధ్యానమును, సమాధియు గలిగెనేని సంయమము అగునుగాని, యొకవిషయమున ధారణయును, తదన్యవిషయమున ధ్యానమును, తదన్య విషయమున సమాధియు గలిగెనేని యీత్రయము సంయమమనబడదు.

సూ॥ తజ్జయాత్ప్రజ్ఞాలోకః॥

తా॥ సంయమము నభ్యసించుచు నందు దార్ఢ్యమును సంపాదించిన యోగికి సంయమము దృఢతనొందుకొలదియు సమాధిప్రజ్ఞయంతకంతకు విశదమగుచుండును. అనగా నతిసూక్ష్మవ్యవహితాద్యర్థములకు పరప్రత్యక్షీకరణ సామర్థ్యము వృద్ధిజెందుచుండును. అనగా ఏ వస్తువు గూడ అడ్డులేక గోచరమగును.

శ్లో॥ వివేకవిశదం చేతః సత్త్వమిత్యభిధీయతే।
భూయఃఫలతి నోమోహం దగ్ధబీజమివాఙ్కురమ్।

తా॥ వివేకజ్ఞానోదయమైన చిత్తము సత్త్వమనబడుచున్నది. దగ్ధబీజమున అంకురము జన్మింపజాలనట్లు అందు మరల మోహము, వాసనలు, ప్రకృతిగుణములు యుద్భవింప జాలవు.

శ్లో॥ ప్రాప్తప్రాప్యోభవాన్నామ సత్త్వభావముపాగతమ్।
చిత్తం జ్ఞానాగ్నినా దగ్ధం నభూయః పరిరోహతి॥

తా॥ జ్ఞానాగ్నిచే దగ్ధమై సత్త్వభావమునంది కృతకృత్యతనందిన చిత్తమున మరల ప్రాకృతగుణములావిర్భవింపవు. చిత్తమే నశించిన మరల వృత్తులెటుల జన్మించును? వృక్షమే కాలిపోయిన మరల దానియందు ఫల పల్లవ పుష్ప లతాదులెట్లు అంకురించును?

ఓమ్ తత్ సత్.

ఓమ్

# ఆత్మ దేహత్రయసాక్షి.

దేహత్రయమునకు ఆత్మసాక్షియను విషయమై పరిపూర్ణ బోధకులలో కొందఱు, అచలమార్గోపదేశకులలో మఱికొందఱున్ను యీలాగున ప్రశ్నింతురు — అదేమనగా దేహత్రయమునకు ఆత్మ సాక్షియైన జాగ్రదవస్థవలె స్వప్నములోను, సుషుప్తిలోను సాక్షిగా యుండవలసినది గదా! ఆలాగున మీకు స్వప్నములోను, సుషుప్తిలోను సాక్షిత్వ ముంటున్నదా? ఈవిషయమై స్వప్నావస్థలోగల మనోవృత్తులకున్ను, సుషుప్తిలో యేమియు తెలియనట్టి యవస్థయున్ను బాగుగ సుఖముగా నిద్రించితినను అనుభవముండుటచే అప్పుడుగూడ సాక్షిగా ఆత్మ యుంటున్నదను మాత్రమే శాస్త్రము తెలుపుచున్నది. నిజముగా అయ్యదియే సత్యము. అంతమాత్రము వారికి తెల్పినచాలును. ఐనచో యీసాక్షిత్వము మీకు జాగ్రదవస్థలోనికి వచ్చిన తర్వాత గదా చెప్ప గల్గుచున్నదనియు, సుషుప్తిలోయుండునప్పుడుగాని, స్వప్నస్థితిలోయున్నప్పుడుగాని మీకు తెలియదు గదా యని వారు ప్రశ్నింతురు. అప్పుడు వారికి సమాధానమునువచించుట కొంతకష్టము. ఈలాటి ప్రశ్న ఎవరిపై వేయుదురు అనగా మంచి అనుష్ఠానమున్ను, తపస్సున్ను, కరుణయున్ను, శాంతియున్ను, బ్రహ్మనిష్ఠయున్ను గలవారిపైననే వేయుదురు. దీనికి సరియగు సమాధానమును చెప్పనిచో మీకు విచారణ జ్ఞానములేదు, ఏదో మూఢవిశ్వాసముగల్గి తపస్సనియు, ధ్యానమనియు చెప్పుచు కాలముగడుపుచున్నవార్లని హేళనగా మాట్లాడుదురు. వారినిగురించి విచారించిన యేలాటి ఆచరణయు యుండదు. మాటలు మాత్రము బాగుగానేర్చికొనియుందురు. అంతియేగాని బ్రహ్మనిష్ఠులకు సంబంధించిన బ్రహ్మచర్యముగాని, విరక్తిగాని, భూతదయగాని వార్లలో చాలామందికి యుండదు. కావుననే యీప్రశ్నలను వేయుచుందురు. ఆమాటలను విని బ్రహ్మనిష్ఠులు, పరమభక్తులు సంశయింప నక్కఱలేదు. సుషుప్త్యవస్థలో మనస్సు మొదలగు యింద్రియములు మూలప్రకృతియందు లీనమై యుండుటచే అప్పుడు ఆత్మసాక్షియై యుండియు చెప్పుటకు సాధ్యము

గాకపోయినదేగాని సాక్షియగు ఆత్మ తెలిసికొనక పోవుటచేత గాదు. ఆలాగున స్వప్నావస్థలో మనస్సున్ను, ఇంద్రియములున్ను స్వవశములో లేనందుచే, అత్తఱి స్వప్నవృత్తాంతమును చెప్ప సాధ్యముకాకపోయినదే కాని సాక్షిత్వము లేకపోవుటచే చెప్పక పోవుటకాదు. జాగ్రదవస్థలోను, తురీయావస్థలోను ఇంద్రియమనస్సులు స్వాధీనములై యుండుటవల్ల అత్తఱి జరుగుచుండు వృత్తాంతములు చెప్పుటకు సాధ్యములగుచున్నవి. పై చెప్పిన విధముగ ప్రశ్నించువారిని యిట్లడుగవలయు. జాగ్రదవస్థ స్థితి ఎట్టిది? ఆలాగున సుషుప్తితురీయముల స్థితులు ఎటువంటివి? వానిధర్మము లెట్టివి? ఈవిషయమై శాస్త్రమేమిచెప్పుచున్నది? అని అడిగినచాలును. అప్పుడు మూడవస్థల లక్షణములు యిట్లుండగా, సాక్షిత్వమునకు హాని యేమి? అట్లుగాక మూడవస్థలలోగలస్థితిని మూడవస్థలలోను తెలిసి చెప్పవలసియుండిన జాగ్రత్స్వప్న సుషుప్తులని వ్యవహారమెట్లు చెప్ప వచ్చును? ఆయవస్థకు జాగ్రదవస్థయని చెప్పవలసినదేగాక స్వప్నసుషుప్తులనిచెప్పరాదు. అదియునుగాక వారితో మీరు నిద్రించినప్పుడు మీ దగ్గఱకు నేనువచ్చి మీతోకొన్నిమాటలు చెప్పెద. మీ సమీపమందుండు కొన్నివస్తువులను యెత్తుకొని వెళ్లెద. అత్తఱి మీరు జాగ్రదవస్థలలోవలె తెలిసికొనిన మీకు స్వప్నసుషుప్త్యవస్థలులేవని నిర్ణయించుకొనవచ్చును. దీనికియొడంబడిన వారివాక్యములు సత్యములనినిర్ణయించుకొనవచ్చును. అట్లుగానిచో వారివాక్యములసత్యములు. పవిత్రాత్ములగు భక్తులను, సాధువులను భ్రమపరచుటకుచెప్పెడువాక్యములని గ్రహించుకొనవలయును. అదియున్నుగాక వారిలోకొందఱు పవిత్రాత్ములై బ్రహ్మనిష్ఠులగు పుణ్యాత్ములను తమకు శిష్యులనుగాచేసికొనుటకున్ను యీలాగున భ్రమనుకలిగింతురు. స్వప్నసుషుప్తుల స్థితియెట్టిదనగా కొందఱికి హృదయస్తంబనమగు వ్యాధిగలదు. లేక స్వల్పమూర్ఛారోగమున్ను గలదు. ఎవరైనను పలుకరించిన మాటలుచెప్పుటకు నోరుస్వాధీనములో యుండదు. చేతితో సంజ్ఞచూపుటకు తలంపు గలిగినను కరములు స్వాధీనములో యుండవు. కన్ను తెరచి చూచుచుండినను ఇంద్రియములు స్వాధీనములోలేనిచో యేమియుచేయజాలరు. కొంతసేపుపోయిన తర్వాత ఇంద్రియములు స్వాధీనములోనికి వచ్చినప్పుడు మూర్ఛావస్థలోగలిగిన

సంగతులన్నియు స్పష్టముగా వచింతురు. మూర్ఛావస్థలో అన్నియును నాకు తెలుసును. కాని ఇంద్రియములు అస్వాధీనములగుటచే ఏమియు చెప్పజాలనయితినని వచింతురు. స్వప్నసుషుప్తుల స్థితియు ఇటువంటిదే. మఱియు యీవిషయమై వేదాంతశాస్త్రములో నొక గాథ గలదు. అదే మన, ఒక నారీమణి నూతినుండి నీరు చేదుకొనునప్పుడు శిరస్సువంచి యుండుటచే కంఠములోగల స్వర్ణహారమొకటి భావిలో పడిపోయెను. అదిచాలాలోతుగల నుయ్యిగాయుండెను. వెంటనే నీటిలో మునిగెడు స్వభావముగల పల్లెవానినియొకరిని పిలిచి భావిలో పడిపోయిన ఆభరణమును తెచ్చియిచ్చిన మంచి బహుమానమును ఇచ్చెదమని చెప్పుటచే అతడు వెంటనే ఆ నూతిలో దిగి అడుగున వెతకునప్పుడు ఆభరణము దొరకెను. సంతోషమును పట్టజాలక వెంటనే పైనుండువారికి తెలుప తలంచినను జలాగాధభాగమున నోరాడకపోవుటవల్ల పైకివచ్చిన తర్వాత చెప్పినట్లు, స్వప్నసుషుప్తుల స్థితి గ్రహించుకొనవలయును. అంతియేకాని అవస్థాత్రయమునకు సాక్షిత్వము లేకపోవుటచే స్వప్నసుషుప్తులలో చెప్పకపోవుటలేదు. ఇదియే దీనిలోగల రహస్యము. శ్రుతియు ఈలాగుననే తెల్పుచున్నది.

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।
తద్బ్రహ్మాఽహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥

తా॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను, సాక్షియై యేఆత్మ ప్రకాశింప చేయుచున్నాడో, ఆ ఆత్మయే బ్రహ్మమనియు, తన నిజస్వరూపమనియు తెలిసికొనినవాడు సర్వబంధములనుండి విముక్తుడగుచున్నాడు. ఆత్మ బోధమనుస్మృతియు యీలాగున వచించుచున్నది.

శ్లో॥ దేహేన్ద్రియమనోబుద్ధిప్రకృతిభ్యో విలక్షణమ్ ।
తద్వృత్తిసాక్షిణం విద్యాదాత్మానం రాజవత్సదా ॥

తా॥ శరీరేన్ద్రియ మనోబుద్ధి ప్రకృతులకంటె వేఱయినటువంటి మనోబుద్ధి చిత్తాహంకారరూపమయిన అంతఃకరణవృత్తులకు సంబంధింపక చూచుచుండు ఆత్మను, రాజునువలె ఎల్లప్పుడును తెలిసికొనవలసినది.

వి॥ ప్రభువు సింహాసనారూఢుడై ధర్మాధర్మములను విచారణ చేయునప్పుడు వాదప్రతివాదులయొక్కయు, న్యాయవాదులయొక్కయు,

మంత్రులయొక్కయు అభిప్రాయములను వారితో సంబంధము లేక విలక్షణముగాయుండి యేలాగున సత్యాసత్యములను తెలిసికొనుచున్నాడో, ఆలాగున దేహమనెడు రాజధానిలో మనోబుద్ధీంద్రియ దేహాదృశ్యధర్మములను ఆత్మసాక్షిగాయుండి తెలిసికొనుచున్నాడు. మఱియు శ్రీ శంకరులు ఇటుల వచించిరి.

యత్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానందోఽనుభూయతే ।
శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానం చ జాగ్రతి ॥

తా॥ సుషుప్త్యవస్థయందు సర్వ విషయశూన్యమై సుఖవిశేషానుభవము గలుగుచున్నది. అదియే ఆత్మానందము. ఇట్టి ఆత్మానంద స్వరూపమును ప్రత్యక్షముచేతను, ఐతిహ్యమువలను, అనుమాన ప్రమాణముచేతను దెలియనగునని శ్రుతి చెప్పుచున్నది.

వి॥ కావున యీ విషయములో 1. శ్రుతియున్ను, 2. ప్రత్యక్షమున్ను, 3. ఐతిహ్యమున్ను, 4. అనుమాన ప్రమాణమున్ను, ఇవి సిద్ధములై యున్నవి. మఱియు,

జాగ్రత్యుద్భూత బాహ్యేన్ద్రియ విషయసముల్లాస సాక్షీశివోఽహం।
స్వప్నే దృష్టప్రపంచ ప్రతిఫలనమనోవృత్తి సాక్షీ శివోఽహమ్।
సుప్తౌ చిత్తే ప్రలీనే ప్రబల తను మహామోహ సాక్షీ శివోఽహమ్।
నిత్యానన్దే తురీయే విగత కలిమలస్సర్వసాక్షీ శివోఽహమ్॥

తా॥ జాగ్రదవస్థయందు జనించిన బాహ్యేన్ద్రియ విషయసముదాయమునకు సాక్షియైనట్టి శివస్వరూపుడగు పరమాత్మను నేను. మఱియు, స్వప్నమందు గాంచబడిన ప్రపంచప్రతిఫలనరూపమగు మనోవృత్తులకు సాక్షియైన శివస్వరూపుడను నేను. సుషుప్తియందు చిత్తము లయింప ప్రబలతమమగు మహాఅజ్ఞానమునకు సాక్షియైన శివరూపుడగు ఆత్మను నేను. మఱియు నిత్యానందమునకు నెలవగు తురీయమందు మాయాదోషరహితుడనై, స్వయంప్రకాశమై, సర్వసాక్షియై వెలుగు శివస్వరూపుడగు ఆత్మయే నేను.

వి॥ ఈవిషయమై మూడు దేహముల ధర్మములను, గుణములను, అవస్థలను వ్రాయంబూనిన, గ్రంథము పెరుగునని తలంచి విడువబడమైనది. ఇది వేదసారమగు నిర్వాణపదమునుగుఱించి చెప్పుటచే చాలా సంక్షి

పముగా నుండును. 1. స్థూల దేహముయొక్క 24 తత్వములను, 2. సూక్ష్మ దేహముయొక్క 17 తత్వములను, 3. కారణ దేహముయొక్క మూలావిద్యయగు ఏకత్వమున్ను, తురీయమగు స్వప్రకాశాత్మయొక్క స్వానుభూతియున్ను, సామాన్యము బ్రహ్మవేత్తలందఱును ఎఱింగి యుండుటచే విస్తరించ బూనలేదు. మఱియు, మూగియగువాడు పంచభక్ష్య పరమాన్నాదులభుజించి తృప్తినొందిన సుఖమున్ను, ఆకలి శాంతియున్ను, అనుభవమును గల్గియుండినను, వాగింద్రియలేమిచే యేలాగున ఇతరులకు, తనకు గల్గిన ఆనందమును తెలుపజాలకపోయినను, అనుభవ సౌఖ్యమున్ను, క్షుద్బాధనివృత్తియును ఎటుల అనుభవగోచర మైయుండునో, ఆలాగున స్వప్నసుషుప్తులలో అస్వాధీనయింద్రియ ములగల్గియుండుటచే అత్తఱి చెప్పకపోయిననేగాని మఱియొకటిగాదు. మఱియు స్వప్నములోగల వృత్తాంతములన్నియు ప్రజ్ఞగలవారు మరు రోజున ఎట్లుచెప్పుచున్నారో, అది వారికి అనుభవములేకపోయిన యెట్లు చెప్పగలరు? కావున దీనియందు సాక్షిత్వమునకు ఏలాటి హానియులేదు. ఇకను వినుడు. కొందఱిని భూతముపట్టుకొని రొమ్మునను అదిమిపట్టుకొని యుండును. అత్తఱి వారు ఎంతమాట్లాడతలంచినను, కన్నుతో వికార చూపులచూపినను, వాగ్బంధనమున్ను, హృదయ స్తంభనమున్ను గల్గి యుండునందుచే, తనయాశయమును తెలుపజాలక పోవుచున్నారు. దయ్యము వదలిపోయిన తర్వాత వారికి స్మృతి వచ్చినపిమ్మట జరిగిన సంగతులన్నిటిని చెప్పుచున్నారు. అప్పుడు ఆత్మకు సాక్షిత్వము లేనిచో యెట్లుచెప్పగల్గిరి? ఇకను వినుడు. మీలో ఎవరైన రాత్రికాలమున నాటకములుగాని, సినిమాలుగాని, అత్యద్భుత విషయములనుగాని చూచిన మఱునటి దినమున యెట్లు మీ మిత్రులకు తెలుపుచుందురో, దానికి స్మృతిజ్ఞానమనిపేరు. సాక్షియగు ఆత్మ అత్తఱి ప్రకాశవంతమై లేనిచో యెట్లు తెలిసికొని చెప్పగల్గును? ఆలాగున సుషుప్తులలో స్మృతిజ్ఞానము లేనిచో సుషుప్త్యవస్థను జాగ్రదవస్థలో ఎట్లు చెప్పగలరు? కావున యీలాటి విషయములలో యేలాటి సందేహమున్ను పడనవ సరములేదు. బ్రహ్మనిష్ఠులకు తగిన ఆచరణ లేకపోవుటచే, చెప్పుటకు మాత్రము నేర్చుకొన్నందుచే వారికి మోక్షముగాని, ఆత్మశాంతిగాని

గలుగదు. ఆమాటలన్నియు ఫోనోగ్రాపుపెట్టె పాడెడు సంగీతరసము వంటిది. దానివల్ల ఆ పెట్టె యెంత ఆనందమునుపొందునో వీరికిని అంత మాత్రమే గల్గును. ఆ పెట్టెకు గల్గెడు మోక్షమెట్టిదో, వీరికి గల్గెడు మోక్షము అట్టిదే. ఒకడు రేడియోద్వారా శబ్దప్రసారణమును చేయువాడుండిన, ఆ యంత్రము చెడిపోవుటవల్ల యెన్నియోవిధములు శబ్దప్రసారణము చేయజూచినను చేయజాలక పోవుటచే ఆ మనుజుడు అత్తట్టి లేనివాడనిగాని; నిద్రించియుండువాడనిగాని, దానిని తెలిసికొనజాలనివాడనిగాని చెప్పువారు యెవరైనయుండినచో, అట్టివారు మాత్రమే సుషుప్తిలోను, స్వప్నములోను గలవిషయములను అప్పుడు చెప్పక పోవుటచే వారికి సాక్షిత్వజ్ఞానములేదని చెప్పువార్లు, ఈవిషయమై ఉత్తరగీత తెల్పుదానిని చూడుడు —

శ్లో॥ అధీత్య చతురోవేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః।
యోవై బ్రహ్మ నజానాతి దర్వీ పాకరసం యథా॥

తా॥ మానవుడు చతుర్వేదంబుల నధ్యయనంబులు చేసియును, ధర్మశాస్త్రంబు లనేకములజదివియును, అనేకపదార్థములగల పాత్రలలో తిరుగుచుండుగరిటె ఏలాగున వానిలోగలరసమును తెలిసికొనజాలక పోవుచున్నదో, చక్కని అనుష్ఠానముచే ఆత్మప్రాప్తిగలుగువరకు యత్నించని వానియొక్క వాక్యములును పైవిధముగానే యుండును.

## కఠోపనిషత్తు.

శ్లో॥ అవిద్యాయామన్తరే వర్తమానాః
స్వయంధీరాః పండితం మన్యమానాః।
దంద్రమ్యమాణాః పరియన్తిమూఢాః
అన్ధేనేవ నీయమానా యథాఽన్ధాః॥

తా॥ అవిద్యకమగు విషయాదులలో పొరలుచుండి తమకుతామే గొప్పప్రజ్ఞావంతులమనియు, తామే బ్రహ్మవేత్తలనియు తలంచువారిగతి యెట్టిదనగా, గ్రుడ్డివానిని ఆధారముచేసికొని ప్రయాణమునుచేసెడు మఱియొకగ్రుడ్డివానిగతి యెట్టిదో, వీరి మోక్షముయొక్క గమ్యస్థానమున్ను అటువంటిదే.

గీత॥ శ్లో॥ యదాతే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదాగన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥

తా॥ ఎప్పుడు నీయొక్క మనస్సు అజ్ఞానమనెడు కల్మషమును దాటగలదో అప్పుడు వినందగినయర్థమును, విన్న అర్థమును తెలిసికొనగలవు. అప్పుడే నిజమైన వైరాగ్యము, లేక వేదనిర్ణయార్థమును ఎఱుంగగల్గును.

వి॥ మూలప్రకృతిని, అవిద్యను, అజ్ఞానమును దాటినతర్వాత మాత్రమే ఇదివరలో మహాత్ములవల్ల శ్రవణము జేసినదాని యర్థము గోచరించును. చదివిన వేదాంతగ్రంథములయొక్క సారమున్ను అప్పుడే తెలియగల్గును. మరల దానికన్న ఇక తెలియందగిన విషయము లేదనికూడ బోధపడును, అని గీతాచార్యుండు ఉపదేశించెను.

శ్లో॥ గుణానేతానతీత్యత్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥

తా॥ జీవుడు దేహోత్పత్తికి కారణభూతములయిన సత్త్వరజస్తమోగుణములనతిక్రమించి పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు మొదలగువానిని చెందక, జీవన్ముక్తుడై నాలో నైక్యమును పొందుచున్నాడు. ఈ యధ్యాయమున మూడుగుణముల వర్ణించునప్పుడు సత్త్వగుణముగూడ త్రిగుణములతో జేరినదిగావర్ణించబడినది. అయ్యదిగూడనశించి విశుద్ధసత్త్వములో ప్రవేశించినప్పుడే మోక్షమని భగవానుడుపదేశించియుండగా, ఇప్పుడుగల బ్రహ్మవిచారము చేయువారలలో తమోగుణాంశమున్ను, రజోగుణాంశమున్ను కొందఱిలో కన్పడుచుండగా, ఇకవీరెప్పుడు ముక్తినిపొందగలరు? ఇట్టియవస్థ జీవించియున్నప్పుడే గల్గవలయునని భగవానుడుపదేశించెను. ఎంతకాలమువఱకు జీవించియుండగలమో యని ఎవరికిని తెలియసాధ్యముకాదు. కావున ఈక్షణమో, యుత్తరక్షణమో, మాపో, రేపో అట్టియవస్థగల్గునని తెలియసాధ్యముకాదు. కావుననిప్పుడే త్రిగుణములగు బన్ధములను త్రుంచుటకు యత్నించవలయును.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్ససుఖీనరః॥

తా॥ ఏ పురుషుడు బ్రతికియున్నప్పుడే కామక్రోధముల యొక్క వేగమును సహింపశక్తిగల్గియున్నాడో (జయించునో) అట్టి సాధకుడు యోగసిద్ధిగలవాడును, శాశ్వతమైన సౌఖ్యముగలవాడును యగుచున్నాడు.

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యేస్థితం మనః।
నిర్దోషంహి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

తా॥ ఎవరియొక్క మనస్సు సకలభూతములయందును బ్రహ్మము సమముగానున్నదను విషయమునందు నిశ్చయరూపమైయున్నదో అట్టివారు యీ లోకమునందే జన్మమును జయించినవారగుచున్నారు. మఱియు బ్రహ్మము ప్రకృతిదోష రహితమైనది. కనుక అట్టిదోష రహితులు సదాబ్రహ్మమునందు యున్నవారగుచున్నారు.

వి॥ బ్రహ్మము యేలాగున ప్రకృతిదోషరహితమైనదో, ఆలాగున ప్రకృతిగుణములు నశించిన జీవుడే బ్రహ్మమందైక్యమగును. నీటిలో నీరున్ను, తైలములో తైలమున్ను ఐక్యమగునేగాని, జలములో తైలమున్ను తైలములోజలమున్ను యెటులఐక్యముగాదో, ఆలాగున బ్రహ్మమెటువంటి పరిశుద్ధమైనదో జీవుడున్ను అట్టి పరిశుద్ధావస్థగల్గునప్పుడే మోక్షమొందును. నిప్పులోనిప్పు నైక్యమగునేగాని, నీరేలాగునమైక్యముగాదో ఆలాగున జ్ఞానజ్యోతిస్స్వరూపుడగు ఈశ్వరునిలో అట్టి జ్ఞానస్వరూపుడగు జీవుడే ఏకత్వమును బడయును. బంగారువ్యాపారమును జేయువారు మలినబంగారమునుగాని స్ఫుటముజేసిన తర్వాత శుద్ధియయిన పిమ్మట మాత్రమే అసలు బంగారులో కలుపుదురు. ఆలాగున ప్రకృతిగుణముగల జీవుడు తపస్స్వాధ్యాయములచే శుద్ధుడయిన మాత్రమే బ్రహ్మమందేకత్వమును నొందగల్గును.

శాంతిపర్వము.

శ్లో॥ యేచ సంశాంతరజసః సంశాంతతమసశ్చ యే।
సత్త్వేస్థితా మహాత్మానో దుర్గాణ్యతితరన్తి తే॥

తా॥ ఎవరైతే లెస్సగా శాంతినొందిన రజోగుణమున్ను, తమోగుణమున్ను గలవారలో, సత్యస్వరూపమగు యాత్మయందు నిల్కడగల మహాత్ములెవరో అట్టివారు సర్వవిఘ్నముల నతిత్వరలో తరింపగలరు.

శ్లో॥ తమోరజశ్చ సత్త్వంచ విద్ధి జీవగుణాత్మకమ్।
జీవమాత్మగుణం విద్యాదాత్మానం పరమాత్మనః॥

తా॥ గీతయందు శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లే వ్యాసులున్ను శాంతిపర్వమున యుపదేశించిరి. తమస్సు, రజస్సు, సత్త్వము అను త్రిగుణములతోఁగూడియున్నప్పుడే జీవుడు అను అవస్థయుండును. ఈగుణములకు విలక్షణునిగా ఆత్మను పరమాత్మస్వరూపునిగా తెలిసికొనవలయును. అనగా మూడు గుణములు యాత్మయందు లేనటుల గ్రహించి త్రిగుణరహితునిగా నెఱుంగవలయును.

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోఽథ భిక్షుకః।
యథోక్తచారిణస్సర్వే గచ్ఛన్తి పరమాంగతిమ్॥

తా॥ పైచెప్పబడిన ప్రకారము త్రిగుణముల రహితమొనర్చినవారు బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, సన్న్యాసియైనను, స్త్రీయయినను, మఱియెవరైనను సర్వోత్కృష్టమగు బ్రహ్మపదమును పొందుదురు.

శ్లో॥ యావానాత్మని వేదాత్మా తావానాత్మా పరాత్మని।
య ఏవం సతతం వేద సోఽమృతత్వాయ కల్పతే॥

తా॥ ఎప్పుడు తన ఆత్మను పరమాత్మస్వరూపునిగా తెలిసికొనుచున్నాడో, అప్పటినుండి ఆ యాత్మ పరమాత్మయందు నిలకడ గల్గియుండును. ఈలాగునెవడైతే యెల్లప్పుడు తెలిసికొనుచున్నాడో, అట్టివాడే మోక్షమునకర్హుడగును. అనగా ఆత్మపరమాత్మలేకత్వము నెంతవరకు తెలిసికొనలేదో యంతవరకు కైవల్యపదమున కర్హుఁడు కాఁడు.

శ్లో॥ సంసారార్ణవ మగ్నానాం జన్తూనామవివేకినాం।
అగతీనాం గతిస్సాక్షాత్ జ్ఞానమేవహి కేవలమ్॥

తా॥ జననమరణ రూపమగు ఆర్ణవమున మునిగినవారికిన్ని, అవివేకులగు మానవులకున్ను, ఏ సహాయములేని వారికిన్ని కేవలము యాత్మజ్ఞానమొక్కటియే గతియగును. అనగా దరిజేర్చును.

శ్లో॥ అయమాత్మా స్వయం జ్యోతిః మహానందమయశ్శివః।
అయోగినః పరోక్షస్స్యాదపరోక్షశ్చ యోగినః॥

తా॥ ఈ యాత్మ స్వయంజ్యోతిస్వరూపము. మహానంద మయము, ప్రకృతి దోషములు లేని శివస్వరూపము, యోగనిష్ఠ లేనివారికి అప్రత్యక్షము; యోగనిష్ఠగలవారికి ప్రత్యక్షము.

ఓమ్ తత్ సత్.

---

ఓమ్

## నిర్వికల్ప సమాధి, బ్రహ్మసాక్షాత్కారము

నిర్వికల్పసమాధి యందుగాని, బ్రహ్మసాక్షాత్కారమందు గాని అహంప్రత్యయము గలుగునా ? అనగా, అహంప్రతీతి యుండునా ? అని యనేకులుశంకింతురు. ఇట్టి శంకా నివారణార్థమె ఈప్రకరణమిచ్చోట వ్రాయబడుచున్నది. శ్రీ శంకరాచార్యులు నిర్వాణషట్కమందీలాగున ఆరు శ్లోకములను చెప్పిరి.

శ్లో॥ మనోబుద్ధ్యహంకార చిత్తాదినాహం
న శ్రోత్రం న జిహ్వా న చ ఘ్రాణనేత్రే।
నచ వ్యోమ భూమిర్న తేజో న వాయు
శ్చిదానందరూపశ్శివోఽహం శివోఽహమ్॥

తా॥ మనోబుద్ధి చిత్తాహంకారములు నేను కాను. శ్రోత్రముగాని, జిహ్వగాని, ఘ్రాణముగాని, నేత్రములుగాని నేనుకాను. ఆకాశముగాని, భూమిగాని, అగ్నిగాని, వాయువుగాని నేనుకాను. చిదానందరూపుడగు శివస్వరూపుడనే నేను, శివస్వరూపుడనే నేను. తక్కిన అయిదు శ్లోకముల గ్రంథాన్తరమున పంఠిచుకొనవచ్చును. ఇది బ్రహ్మానుసంధానపరులకు చాలమంచిది.

దీనియందు నిర్వాణస్తుతిలో శివోఽహమని, తనసాక్షాత్స్వరూపము వెలుగుచున్నదని గోచరమగుచున్నది. "అహం బ్రహ్మాఽస్మి" అను మహావాక్యమునందును అహం ప్రత్యయము కన్పడుచున్నది. అది యేలాగున అద్వైతమగును? అట్టిది యెట్లు నిర్వికల్పసమాధి యగును? అని శంకించువారుగూడ గలరు.

"అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం చిత్తబంధం వినాశయేత్।
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం బుద్ధివ్యాధిం వినాశయేత్॥
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం సంకల్పాదీన్వినాశయేత్।
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్॥

ఈలాగున యుపనిషత్తు యుద్ఘోషించుచున్నది.

తా॥ అహంబ్రహ్మాఽస్మి అను యీ మంత్రము, చిత్తము యొక్క బంధమును నశింపజేయుచున్నది. అహంబ్రహ్మాఽస్మి యను నీమంత్రము బుద్ధియొక్క అవిద్యారోగమును విలయము నొందించుచున్నది. అహంబ్రహ్మాఽస్మియను నీ మంత్రము సంకల్పములనన్నిటిని రహితముగ జేయుచున్నది. అహంబ్రహ్మాఽస్మి యను మంత్రము కోటిదోషములను వినాశ మొనరించుచున్నది. మహావాక్యమనగా, అన్నివాక్యములకన్న, అన్ని మంత్రములకన్న గొప్పదనిభావము. దానికన్న గొప్పది మఱియొకటి లేదు. అది నదులన్నిటికి సముద్రమువంటిది. అది ప్రకాశములన్నిటికి సూర్యునివంటిది. తీర్థములన్నిటికి గంగానదివంటిది. పై జెప్పిన మహావాక్యములో సంశయముగలుగుటకు శ్రోత్రియుడగు బ్రహ్మనిష్ఠునివద్దనే బ్రహ్మ విచారమునుచేయక గలిగెడు మనోదోషమే యగును. అహం ప్రత్యయము లేనిచో అది జడమేయగును. సుషుప్తిలోను, మూర్ఛలోను అహంప్రతీతి లేదు. కావున అట్టి స్థితియే నిర్వికల్పసమాధి యనియు, బ్రహ్మసాక్షాత్కార స్థితియనియు చెప్పవలసివచ్చును. మఱియు స్తంభముగాని,విగ్రహముగాని మహానిర్వికల్పసమాధియందును, బ్రహ్మసాక్షాత్కార స్థితియందును యుంటున్నదని చెప్పుట యెంత బాగుండును. అయితే అహంప్రత్యయమందు మూడంతస్థులుగలవు. దీనిభేదము తెలిసికొనకపోవుట వలననే యిట్టి సందేహము గలుగుచున్నది. వివేక చూడామణిని చూడుడు:—

శ్లో॥ దేహోఽహమిత్యేవ జడస్యబుద్ధిర్దేహేచ జీవే విదుష స్త్వహంధీః।
వివేకవిజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాఽహమిత్యేవ మతిస్సదాత్మని॥

తా॥ ఆత్మానాత్మ వివేకశూన్యుడగు మూఢుడు దేహమే యాత్మయని తలంచును. కొద్దిశాస్త్రము జదివి యాచరణలేని పండితుడు చిదాభాసుడగు జీవుడే (ఆత్మ) తానని అనుకొనును. దృఢమగు అప

రోత్కజ్ఞానముగల మహాత్ముడు "అహంబ్రహ్మాఽస్మి" యనెడి బుద్ధితో బ్రహ్మమేతానని అనుకొనును. ఇట్టి స్థితిలో యుండువానిని గురించియే "అహంబ్రహ్మాఽస్మి"యను వాక్యము విధింపబడెను. ఇట్టి అనుభవము లేకపోయిన మహావాక్యమందుగల "అహంబ్రహ్మాఽస్మి" అనువాక్యము నెట్లుఅర్థమును చేయగలరు? స్వానుభవమెటుల సిద్ధించును? ముముక్షువుల కేలాగున బోధింపగలరు? బ్రహ్మవిద్యాపరంపర లోకమున యేలాగున సృష్ట్యారంభమునుండి ప్రవర్తించివచ్చెను? మహాకల్పము వఱకు ఇది యేలాగున గురుశిష్యమార్గమున నడచును? ఏమి! బ్రహ్మము జడమా? ఆత్మయు జడమా? ఆత్మజ్ఞానియు జడుండా?

శ్లో॥ దేహాఽత్మజ్ఞానవజ్జ్ఞానం దేహాఽత్మజ్ఞానబాధకం।

ఆత్మన్యేవ భవేద్యస్య సనేచ్ఛన్నపి ముచ్యతే॥

తా॥ అజ్ఞుడైనవానికి దేహమే తాననుజ్ఞానము దృఢముగా యేలాగుగల్గియున్నదో, ఆలాగున నేను దేహముగాను, నిత్యముక్తస్వయం ప్రకాశమగు బ్రహ్మమేయనుజ్ఞానము ఎవనికి దృఢముగా గలిగియుంటు న్నదో, అప్పుడు ముక్తిని గురించి యిచ్ఛయింపకయున్నను ముక్తుడే యగును. మనస్సుబుద్ధి యెంతశుద్ధములై యుండిన, ఏకాగ్రతగల్గియుండిన అట్టిభావనచేయుటకు అర్హతగల్గియుండునో ముముక్షువులు గ్రహించు కొనవలయును. వస్త్రము శుద్ధముగాయున్నప్పటికిని యే యే రంగులలో అద్దినచో వస్త్రముయొక్క తెలుపు కనపడక యేలాగున రంగుల రూపమై వెలయుచుండునో, ఆలాగున మానవులయొక్క భావన యనుస రించి ఆత్మయు ఆలాగునయుండనని తోచేశక్తి మాయయందు గలదు.

శ్లో॥ పప్వుస్తుపాదిభిః కోశైర్యుక్తం యుక్త్యవఘాతతః।

ఆత్మానమాంతరం శుద్ధం వివిచ్యాత్తణ్డులం యథా॥

తా॥ ధాన్యమునుదంచి యేలాగున పొట్టునుతొలగించి బియ్య మును వేరుపరచుచున్నారో, ఆలాగున పంచకోశములతోగూడిన ఆత్మను విచారణచేతను, తపస్సుచేతను వేరుపఱచుకొనవలయు. పొట్టుపోయిన తర్వాత ఆ బియ్యమేలాగున మొలకెత్తదో, ఆలాగున ప్రకృతినుండి వేఱుపరచబడిన ఆత్మకు మరల జననమరణములుండవు.

శ్లో॥ జీవన్ముక్తిస్తు తద్విద్యాత్పూర్వోపాధి గుణాం స్త్యజేత్।
స సచ్చిదాది ధర్మత్వాద్భజే భ్రమరకీటవత్ ॥

తా॥ ఆత్మజ్ఞాని ముందున్న స్థూల సూక్ష్మకారణోపాధులను, సత్త్వరజస్తమోగుణములను విడిచిపెట్టుచున్నాడనునది యేదిగలదో, అది జీవన్ముక్తియని తెలియవలయును. అటువంటి యవస్థగలజ్ఞాని సచ్చిదానందాది ధర్మములుగలవాడగుటవల్ల పురుగు యేలాగున తుమ్మెదను భావించి క్రిమిధర్మమునువిడిచి భ్రమరమగుచున్నదో, ఆలాగున చిరకాల మాత్మచింతన చేత జీవత్వమునశించి శివత్వమును పొందుచున్నాడు. ఈ యవస్థగల్గుటకు చిరకాలానుష్ఠానముండవలయును. చింతకాయ ఏలాగున పండు అగునప్పుడు బెరడునుండి వేరుపడుచున్నదో, పండు కొబ్బరకాయలో జలమునశించినప్పుడు కొరిడియై కొబ్బరచిప్పనుండి వదలిపోవుచున్నదో, సర్పమేలాగున కాలమువచ్చునప్పుడు కుబుసము నుండి వదలిపోవుచున్నదో ఈ జీవుడును జ్ఞానతపస్సులవలన కాలము పరిపక్వమగునప్పుడు బంధనమునుండి విముక్తుడగుచున్నాడు. అదియే మోక్షము. పత్తికాయ యేలాగున పక్వమగునప్పుడు పగిలి తెల్లని దూదిని వెలుపరచుచున్నదో, టెంకాయగెల పరిపక్వకాలమున పగిలి పూలతో శోభించుచున్నదో, అరటిగెలయొక్క ఆవరణమగు రేకులు యొక్కొక్కటి స్వయముగావదలిపోయి కాయలేలాగున శోభించుచున్నవో, కాలము పరిక్వమగునప్పుడు గ్రుడ్లనుండిభేదించి పక్షులేలాగున లేచిపోవుచుండునో ఆలాగున సాధన పరిపక్వమగునప్పుడు యీ జీవాత్మయు అన్నిబంధములనుండి విముక్తిగల్గి సత్యజ్ఞానానందమయుడై ప్రకాశించుచుండును.

శ్లో॥ నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥

తా॥ ఆత్మజ్ఞానమునకు సమానమయినదియు, పావనమైనదియు, పాపశోధకమయినదియు యీ లోకమందు మఱియొకటిలేదు. అట్టి జ్ఞానము తపోజ్ఞానముచే ఆత్మపరిశుద్ధ మగునప్పుడు స్వయముగా తనలోనే తాను పొందుచున్నాడు. అని గీతయందు శ్రీ కృష్ణభగవానుడుపదేశించెను. దీనివల్ల ఆత్మజ్ఞానము మఱియొక దేశములో గాని, లోకములో

గాని పొందంబడునది కాదనియు, అంతఃకరణము పరిపక్వమగునప్పుడు తనలోనే స్వయముగా పొందబడుచున్నదనియు తెలుపడమైనది. అట్టి జ్ఞానప్రాప్తికి కాలనిర్ణయము దీనియందు చేయలేదు. ఏలననగా పూర్వ జన్మ అనుష్ఠాన పక్వాపక్వములననుసరించి దీర్ఘకాలముగాని, స్వల్ప కాలముగాని పట్టవచ్చును. ఇదియే సరియగు యుపదేశమగును. కట్ట కడకు జీవన్ముక్తిగల్గువరకు అనుష్ఠానము చేయుచుండవలయును. అదియే సరియగు సత్యము. ఇక వేదాంతపంచదశిలో చెప్పిన కొన్నివాక్యముల తెలిపెద.

శ్లో॥ ఏకఏవాత్మా మంతవ్యో జాగ్రత్స్వప్నసుషుప్తిషు।
స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే॥

తా॥ జాగరితావస్థయందును, స్వప్నావస్థయందును, సుషుప్త్య వస్థయందును ఒక్కడగు ఆత్మయే తెలియదగినవాడగును. జాగ్ర త్స్వప్నసుషుప్త్యవస్థలకంటే అన్యత్వమునొందిన యాత్మకు మరల జననము లేదు.

శ్రుతి॥ సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి।
నాస్యాబ్రహ్మవిత్కులే భవతి। తరతి శోకం తరతి పాప్మానం
గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి॥

తా॥ ఆ పరబ్రహ్మము నెవడెరుగునో వాడే పరబ్రహ్మమగు చున్నాడనియు, వానికులమందు బ్రహ్మవేత్తకానివాడు జన్మింపడనియు, దుఃఖమును దాటుచున్నాడనియు, పాపమును తరించుచున్నాడనియు, పంచకోశరూప గుహావలనను, కామక్రోధరూప హృదయగ్రంథుల వలనను ముక్తుడగుచు అమృతరూపుడగుచున్నాడనియు, శ్రుతి తెల్పుచున్నది.

శ్లో॥ భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా॥
పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్॥

తా॥ నిశ్చయబుద్ధిగలవానిచేత ఏవస్తువు తీవ్రవేగముచేత (రేయుం బవళ్లు) భావింపఁబడుచున్నదో, ఆ జ్ఞేయవస్తువుగా (అపరోక్షముగాఁ దెలియఁదగిన బ్రహ్మముగా) భ్రమరకీటమువలె యగుచున్నాడు. పురుగు యేలాగున తుమ్మెదను భావించిభావించి భ్రమరరూపమై మారు

చుండునో, ఆలాగున జీవాత్మను పరమాత్మనుగా ఎడతెగక భావించుటవల్ల ఆపరమాత్మరూపమే యగుచుండును. కావుననే శాస్త్రములో శ్రవణ మాత్రముచే తృప్తి నొందకూడదనియు, మనన నిదిధ్యాసములు బాగుగా చేయవలయుననియు చెప్పెడి రహస్యము. నిజముగా ఆలోచించిన మతము లన్నియు భావనారూపములే. అట్లుకానిచో శైవవైష్ణవ భేదములు, ఇతర మతభేదములు గూడ కనుపించుట కవకాశము లేదు. ఒకడాత్మను దుఃఖరూపిగాను, ఇంకొకడు సుఖరూపిగాను, మఱియొకడు జీవరూపిగాను, ఇంకొకడు శివరూపముగాను భావించుటకు కారణమేమి? భావనా శక్తి చేత జీవాత్మపరమాత్మస్థితిని పొందుచుండును. ఆ భావన యెటులుండ వలయుననగా మామిడికాయ మొదలగు వాటిని యూరగాయ వేయగా అవి కొంతకాలమునకు యేలాగున లవణరసమై మారుచుండునో, ఆలా గున పిండితో చేయబడిన మిఠాయివస్తువులు చక్కెరపాకములో యూరు టవల్ల యెట్లు మధురములై మారుచుండునో, నిరంతర ధ్యానమువల్ల జీవాత్మలోగల ప్రకృతిసంబంధ దుఃఖములన్నియు నశించి ఆనందమయ ములై మారుచుండును. ప్రపంచములో కనుపించెడి మతస్థులందఱు పూర్వము యొక మతముననుండి మఱియొకమతములోనికి మాఱినవారే. అనగా హిందువులలో అనేకులు మహమ్మదీయ మతములోనికి మార్చ బడిరి. కొన్నితరములు జరిగినపిమ్మట వారందఱున్ను అసలు మహమ్మ దీయులని దృఢనిశ్చయము గలవారైరి. పంజాబు మొదలగుప్రదేశము లలోగల అధికమహమ్మదీయులును హిందువులై యుండెడివారే, ఇప్పుడు వారు అసల్ ముస్లీములని దృఢవిశ్వాసము గల్గియున్నారు. ఆలాగున క్రైస్తవులలోను, బౌద్ధులలోను యూహించుకొనవచ్చును. అట్లే శైవులు కొందఱు వైష్ణవులుగాను, వైష్ణవులుకొందఱు శైవులుగాను మారి యున్నారు. తరములు గడచిపోవుటచే వైష్ణవులు తాము విష్ణుమతస్థుల మనియు, శైవులు తమను శివమతస్థులమనియు నమ్ముచున్నారు. ఆలా గున ఒకఆంజనేయ విగ్రహముగాని, ఆదిశేషవిగ్రహముగాని, నందికేశ్వర విగ్రహముగాని యుండిన దానిని పడగొట్టి కఱిగించిన శ్రీరామ విగ్ర హముగాని, నారాయణవిగ్రహముగాని, ఈశ్వరవిగ్రహముగాని, మఱియే విగ్రహముగాని యేలాగున చేయవచ్చునో, ఆలాగున భావనాశక్తి చేత

పూర్వపు స్వభావమును మార్పుచేసికొని నవీనరూపమును చేసికొన వచ్చును. ఆలాగున ఒకమిషనునుగాని, చక్రమునుగాని, ఆయుధమునుగాని కఱిగించి మఱియొక యంత్రమునుగాని, చక్రమునుగాని, ఆయుధమును గానిచేయవచ్చును. ఆలాగు బ్రహ్మనిష్ఠులు తమకు పూర్వముగా యేర్పడి యుండు జాత్యాది నామరూపములను భావనాశక్తిచేత విలయము నొందించి గొప్ప ఋషిసన్తతి వారమనియు, పరమాత్మ స్వరూపుల మనియు భావించవలయును. అప్పుడట్టి స్థితి తప్పక గల్గును.

గృహస్థాశ్రమమున యుండువారు యత్యాశ్రమమును స్వీకరించిన తాము సన్న్యాసి యని ఎట్లు దృఢభావముగల్గి యుందురో, యీ మార్పున్ను ఆలాటిదే యగును.

మఱియు ఒకఇన్స్పెక్టరుగాని, సూపరెంటుగాని, కలెక్టర్‌గాని యుండిన విరోధులతో యేదైన వాదప్రతివాదములు వచ్చినప్పుడు నేను యుద్యోగస్థుడగు ఒకఇన్స్పెక్టర్ అనిగాని, లేక పోలీసుడిపార్టుమెంటుసూపరెంటనిగాని, ప్రభుత్వమువారిచే నియమింపబడిన కలెక్టర్ అనిగాని యెటుల పౌరుషముగా పలుకుచుందురో, యిట్టి భావము వారికి ఎటుల గల్గెను? తమ్ముకొంతకాలము ఆలాగునతలంచుటచేత ఆభావముయిప్పుడు రూఢిపడెను. ఆలాగున ముముక్షువులందఱున్ను తమపూర్వజాతిగుణము లుండిన త్యజించి నూతనముగా యేయనుష్ఠాన ధర్మపద్ధతిలో యుంటున్నారో, అట్టి పరమఋషులవంశములో యుండువారనియు, తమ ఆత్మలనుగూడ దైవస్వరూపములనియు దృఢభావనకొంతకాలముచేసిన తప్పక అట్టి స్థితిగల్గును. ఇదియే భావనావిశేషముయొక్క మహిమయని మరువకూడదు.

శ్లో॥ మూషాసిక్తం యథాతామ్రం తన్నిభం జాయతే తథా।
రూపాదీన్వ్యాప్నువచ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువమ్॥

తా॥ మూషయందు కఱుగజేసిన కంచుఒక్కటియే అయినను కరువులు (అచ్చులు) యేయే రూపముగాయుండునో వానిలో పోయబడిన కంచున్ను ఆయారూపములతోకూడిన విగ్రహములుగానే యేర్పడునటుల నామరూపములులేని పరమాత్మను సాధకులు తమహృదయములో

యేలాగున భావింతురో ఆలాటి భావనలే యేర్పడును. ఇదినైష్కర్మ్య సిద్ధిలో సురేశ్వరాచార్యులు తెలిపిన దృష్టాంతము.

శ్లో॥ నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః।
ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్॥

తా॥ ఆత్మకావరణ భూతములైన పలురెంగులైన శరీరముల వలననే ఉదకమందు రుచియు, రంగును మొదలుగాగల భేదములు వలెను, పరమాత్మయందు కులము, పేరు, బ్రహ్మచర్యము మొదలయిన ఆశ్రమములు మొదలుగాగలవి కల్పింపబడినవి, అని శ్రీ శంకరులు ఆత్మబోధలో తెలిపిరి. పైజెప్పిన దృష్టాంతములన్నియు సామాన్యబుద్ధి గలవారు గ్రహించుటకొఱకు తెలుపడమైనది. జలము నిర్మలముగా యుండినను ఎఱుపు, నలుపు, పచ్చని రంగులతో కలియునప్పుడు ఆయా రూపములుగా కన్పించునట్లును, ఉప్పు, పులుపు, చేదు, తీపి పదార్థములతో చేరునప్పుడు ఆయా రుచులుగా గోచరించునట్లును ఈ ఆత్మ గూడ శుద్ధజ్ఞాన స్వరూపముగాయున్నప్పటికిన్ని మానవునియొక్క కల్పనా రూపములచే ఆత్మజ్ఞానము మరుగుపడి దృశ్యజ్ఞానరూపముగా పరిణమించును. నిజముగా విచారించిన ఆత్మయందు యీమార్పులెవ్వియు గలిగియుండలేదు. అదెల్లప్పుడు ఆత్మమయముగాను, జ్ఞానమయముగాను, శివమయముగాను, పరిణామ రహితముగాను, ఏకముగాను యుంటున్నది. అదియే నీయొక్క స్వరూపమని తత్త్వమసి మహావాక్యము యుపదేశించుచున్నది. అది ఆలాగున బ్రహ్మాఽస్మియను భావనచేయుటకు మనో పరిపక్వములేనివారికే పైజెప్పిన దృష్టాంతములచెప్పి వారికిగలసంశయముల నివర్తించుటకొఱకు శ్రుతి యీలాటి యుదాహరణలన్నియు నిరూపించుటకు యత్నించడమైనది. నిజముగాచెప్పిన అద్వైత బ్రహ్మ సాక్షాత్కారసిద్ధి గల్గుటకు వివర్తవాదమొకటియే సరిగాతెలుపునదిగా యుంటున్నది.

శ్లో॥ రజ్జుసర్పవదాత్మానం జీవం జ్ఞాత్వా భయంవహేత్।
నాహం జీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్॥

తా॥ త్రాడును పామునువలె సత్యజ్ఞానానంద స్వరూపియగు నాత్మను కించిజ్ఞునిగాను భ్రమించి భయమునుపొందుచున్నాడు. అప్పుడు

వివేకముచేత నేను కించిజ్జ్ఞుడనుగాను, ఇకనేమన పరబ్రహ్మమని గుర్తెఱిగినట్లాయెనా, అవిద్యాదులవలనగలుగు భయమెంతమాత్రమును లేనివాడుగా కాగలడు. విచారసాగరమున అహంబ్రహ్మాఽస్మి అనిగల అహం ప్రత్యయమునుగూర్చి తెల్పినది చూడతగినది.

జ్ఞానమునకు సాక్షాత్సాధనము శ్రోత్రసంబంధమయిన వేదాంత వాక్యమే. ఆ వేదాంతవాక్యము రెండు విధములుగానున్నది. ఒకటి అవాంతరవాక్యము. రెండవది మహావాక్యము. అనగా పరమాత్మయొక్క లేక జీవునియొక్క స్వరూపమును బోధించునట్టి వాక్యము అవాన్తరవాక్యము. మఱియు జీవపరమాత్మలయొక్క యేకత్వమును బోధించునట్టివాక్యము మహావాక్యము. (అవాంతరవాక్యమువలన పరోక్షజ్ఞానము, మఱియు మహావాక్యమువలన అపరోక్షజ్ఞానముగల్గును.) "బ్రహ్మమున్నది" అను నీ జ్ఞానము పరోక్షజ్ఞానమని, "నేనుబ్రహ్మము" అనునీజ్ఞానము అపరోక్షజ్ఞానమని ఎఱుగవలయును. ముక్తలక్షణము.

"స్థూల సూక్ష్మ కారణశరీరములకన్న భిన్నమయిన తన స్వరూపము సాక్షాత్పరబ్రహ్మముగాయున్నది." ఈప్రకారముగా అహం బుద్ధిచే పరబ్రహ్మ స్వరూపముయొక్క అపరోక్షజ్ఞానము యెవనికైనదో వానిని ముక్తుడందురు.

## సమాధి నిరూపణము.

వ్యుత్థాన సంస్కారముయొక్క తిరస్కారము, మఱియు నిరోధ సంస్కారముయొక్క ప్రకటత గల అంతఃకరణముయొక్క ఏకాగ్రతరూప పరిణామమును సమాధియందురు. ఆ సమాధి ద్వివిధము. మొదటిది సవికల్పము. రెండవది నిర్వికల్పము. వానిలో 1. జ్ఞాతృజ్ఞానజ్ఞేయ రూపత్రిపుటీభానసహితమయిన అద్వితీయబ్రహ్మమునందలి అన్తఃకరణవృత్తియొక్క స్థితిని సవికల్పమందురు. ఆ సవికల్పసమాధియు శబ్దానువిద్ధ, శబ్దాననువిద్ధభేదమువలన ద్వివిధము. వీనిలో "అహం బ్రహ్మాఽస్మి" అను నీశబ్దముచేత అనువిద్ధము (అనగా మిశ్రమయినది.) శబ్దానువిద్ధము. శబ్దరహితమయినది శబ్దాననువిద్ధము. 2. త్రిపుటీజ్ఞానరహితమగు అఖండ బ్రహ్మాకారవృత్తిని నిర్వికల్పమందురు.

ఈరీతిగా సవికల్పనిర్వికల్ప భేదముచేత సమాధి ద్వివిధము. వీనిలో సవికల్పసమాధి సాధనరూపముగాను, నిర్వికల్పసమాధి ఫలరూపముగాను యున్నది. సాధనరూపమయిన సవికల్పసమాధియందు త్రిపుటీరూపద్వైతము ప్రతీతమయినను అద్వైతము బ్రహ్మరూపముచేత ప్రతీతమయియున్నది. ఎట్లు మృత్తికావికారమును మృత్తికారూపమని యెఱుగుటవలన వివేకికి మృత్తికావికారమయిన ఘటాదికము ప్రతీతమయినను మృత్తికారూపముచేతనే ప్రతీతమగునో, అట్లు సవికల్పసమాధియందు త్రిపుటీద్వైతము, బ్రహ్మరూపముచేతనే ప్రతీతమగుచున్నది. నిర్వికల్పసమాధియందు సవికల్పసమాధివలె త్రిపుటీరూపద్వైతము విద్యమానమయినను దానియొక్క ప్రతీతిగలుగదు. ఎట్లు జలమందువైచిన లవణము అచ్చట విద్యమానముగాయుండినను పైన జలముండుటవలన నేత్రముచేత లవణము ప్రతీతముగానేరదో, అట్లు నిర్వికల్ప సమాధియందుత్రిపుటి ప్రతీతముకానేరదు. ఈరీతిగ సవికల్పసమాధియందు బ్రహ్మరూపముచేత, త్రిపుటీద్వైతముయొక్క ప్రతీతిగలదు. మఱియు నిర్వికల్పసమాధియందు దానియొక్కప్రతీతిలేదు. రెంటియందిట్టి విలక్షణత గలదు.

అద్వైతావస్థాన సమాధికి సుషుప్తికిగల భేదము అద్వైతావస్థానరూప సమాధికిని సుషుప్తికిని యీభేదముగలదు. సుషుప్తియందు వృత్తియొక్కలయము అజ్ఞానమందు అగును. అద్వైతావస్థాన సమాధియందు వృత్తియొక్కలయము బ్రహ్మప్రకాశమందగుచున్నది. సుషుప్తియొక్క ఆనందము, అజ్ఞానావృతము ఉక్తసమాధియందు నిరావరణబ్రహ్మనందమే ప్రకటమగుచున్నది. ఇక ఈ సమాధి విషయమై పాతంజల యోగశాస్త్ర విభూతిపాదమున విస్తారముగా కనందగును. ఇది బాగుగా తెలిసికొనదగిన విషయమే. ఈ గ్రంథము అతిసంగ్రహమగుటచే విస్తరింప బూనలేదు. ఇక పంచదశిలో గల మహావాక్య అహం ప్రత్యయమును గుఱించి కొద్దిగా తెలిపెద. పైజెప్పిన నిర్వికల్పసమాధివలె, యీ మహావాక్య చతుష్టయముగూడ ప్రజ్ఞాశాలురు గ్రహించందగినదే. అప్పుడే నిర్వికల్ప సమాధికిని బ్రహ్మసాక్షాత్కారమునకును ఒకటే యర్థమని గోచరించును. అదిన్ని ఇచ్చట

సంక్షిప్తముగానే వ్రాయబడును. ప్రశ్నోత్తరమాణిక్యమాలాది గ్రంథములలో విస్తరించి తెలిపియుండుటచే అదే మరల ఇచ్చోట వ్రాసిన చర్వితచర్వణమగును. అయినను సందర్భానుగుణ్యముగ కొంచము తెలుపబడుచున్నది.

1. ప్రజ్ఞానం బ్రహ్మ = ఋగ్వేదము. ఐతరేయోపనిషత్తు.

శ్లో॥ యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ।
స్వాద్వస్వాదూవిజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్॥

టీక॥ యేన = చక్షుద్వారా వ్యాపించిన అంతఃకరణవృత్తితో కూడినట్టి యే చైతన్యముచేత, ఇదం = చూచుటకు యోగ్యమయిన యీ రూపాదికమును, ఈక్షతే = పురుషుడు చూచుచున్నాడో, శృణోతి = కర్ణముద్వారా శబ్దములను వినుచున్నాడో, జిఘ్రతి = ఘ్రాణముద్వారా గంధముల నాఘ్రాణించుచున్నాడో, స్వాద్వస్వాదూ= రుచియు అరుచులను, విజానాతి = జిహ్వచే యెరుగుచున్నాడో, తత్ = ఆ చైతన్యము, ప్రజ్ఞానం = ప్రజ్ఞానమని, ఉదీరితం = చెప్పబడుచున్నది.

చర్మముద్వారా స్పర్శమును గ్రహించుచున్నాడో, అదియు దీనితో చేర్చవలయును. ఈ ప్రజ్ఞానము బాగుగ తెలిసికొని రూఢిపరచిన మాత్రమే ఆ ప్రజ్ఞానమే బ్రహ్మమను రెండవ శ్లోకముయొక్క అర్థము రూఢిపడును. అట్లైన మాత్రమే మానవులకు ధైర్యముగల్గును. అది ఆరూఢమయిన బ్రాహ్మణసమారాధనలో బ్రాహ్మణుడగునా, కాదా అని సంశయముగలవానిని మానేజర్ అడిగిన, బ్రాహ్మణుడయిన నేను బ్రాహ్మణుడని ధైర్యముగా చెప్పుటకు ఎట్లు శక్తివంతుడగునో, బ్రాహ్మణుడు కానివాడైనచో, బ్రాహ్మణుడు కానివాడు యేలాగున బ్రాహ్మణుడని చెప్పుటలో సంశయమున్ను, భయమున్ను గలవాడగునో, ఈ ప్రజ్ఞానం బ్రహ్మమను వాక్యమువల్ల అందఱికిని బ్రాహ్మణునికి వలె ధైర్యము గలుగుచుండును. ఒకవేళ బ్రహ్మణేతరుడు బ్రాహ్మణుడని చెప్పినను దానికి సంబంధించిన గోత్ర, సూత్ర, ప్రవర, వేదశాఖలను అడుగునప్పుడు సంపూర్ణముగా తెలియక పోయినచో యెట్లు బాధకు కారణమగుచున్నదో, ఆ లాగున ప్రజ్ఞానం బ్రహ్మమని వాక్యములో గూడ నిర్భయత్వము గలుగవలసియుండిన దానికి సంబంధించిన శాస్త్ర

నుష్ఠానములు బాగుగ గల్గియుండవలయును. లేనిచో అవిద్యచే భయముగల్గును. ఈ బోధయొకటియే కారుచీకటిని ప్రచండభాస్కరుడు పారదోలునట్లు, అవిద్యను అవిద్యాకార్యములను హృదయమునుండి పరుగెత్తింప జేయును.

శ్లో॥ చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు।
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి॥

టీక॥ చతుర్ముఖేన్ద్రదేవేషు— చతుర్ముఖ=బ్రహ్మదేవుని యందును, ఇంద్ర దేవేషు=ఇంద్రాది దేవతలయందును, మనుష్యాశ్వగవాదిషు— మనుష్య=మనుష్యులయందును, అశ్వ= గుఱ్ఱములయందును, గవాదిషు=. గోవు మొదలగు వానియందునుగల, ఏకం = ఒకటియగు, చైతన్యం = చైతన్యము, బ్రహ్మ=బ్రహ్మమగును. అతః=ఈ కారణమువలన, మయ్యపి= నాదేహమందుగల, ప్రజ్ఞానం = ప్రజ్ఞానము, బ్రహ్మ = బ్రహ్మమగును. ఈ బోధము దృఢముగాగలిగిన, ఉద్యోగుల సంఘమందు దానికి సంబంధించిన అర్హతగలవాడు తనకును అట్టియుద్యోగమునకు అర్హత గలదని సధైర్యముగ వాదింపవచ్చునో, అర్హతలేనివాఁడు ఎటులవాదింప జాలడో, ఈ ప్రజ్ఞానమే బ్రహ్మమను బోధగల్గిన ముక్తివిషయములోను అంతధైర్యము గల్గును. ప్రపంచములోను అంత ధీరత్వముగల్గును. ఇది "సూత్రే మణిగణాఇవ దృశ్యతే జలచంద్రవత్" అను అర్థమును నిరూపణముగావించుచున్నది. అట్టిప్రజ్ఞాన బ్రహ్మమనుబోధగల్గునప్పుడు నిర్భయుడై సధైర్యముగ అట్టిబ్రహ్మమే తాననియు, అంతటిలోనుండెడు ప్రజ్ఞానమే బ్రహ్మమనిబోధించుటకును శక్తిగలవాడగును. ఇదిముముక్షువులగు ప్రతిస్త్రీపురుషులెల్లరును అవగాహనమును చేసికొనవలసిన ముఖ్యవిషయము. లేనిచో జాతి వర్ణాశ్రమ స్త్రీపురుషాది దేహకల్పిత అజ్ఞానము తప్పక బాధించును. అప్పుడు భయముగూడ అట్టిఆత్మను ఆవరించును. ఇట్టిమహాశక్తి ఆత్మానుభవమున యుండుటచేత శ్రీరామతీర్థ వివేకానందాదులు లోకమంతటను బ్రహ్మబోధను సల్పుశక్తివంతులైరి.

2. అహం బ్రహ్మాఽస్మి=యజుర్వేదము. బృహదారణ్యకోపనిషత్తు.

శ్లో॥ పరిపూర్ణః పరాత్మాఽస్మిన్దేహే విద్యాధికారిణి।
బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే॥

టీక॥ పరిపూర్ణః =పరిచ్ఛిన్నత్వములేని పరమాత్మ, అస్మిన్ = ఈ మాయాకల్పిత జగత్తునందు, విద్యాధికారిణి-విద్యా=జ్ఞానసంపాదనమునకు, అధికారిణి=యోగ్యమగు, దేహే=మనుష్యాది శరీరమందు, బుద్ధేః= బుద్ధికి, సాక్షితయా=సాక్షిభావముచేత, స్థిత్వా = ఉండి,స్ఫురన్ =ప్రకాశించుచున్నవాడగుచు, అహమితి=నేనని, ఈర్యతే=చెప్పబడుచున్నాడు.

వి॥ ఇచ్చోట బ్రహ్మసాక్షాత్కారస్థితిలో అహంప్రత్యయము గలదా, లేదాయని సందేహముయొక్క నివృత్తియగుచున్నది. కావుననే యీప్రకారముగ మొదటనే "దేహోఽహమనియు, జీవోఽహమనియు, బ్రహ్మాహమనియు" అహంశబ్దమును మూడుభాగములుగా చేయడమయినది. ఇచ్చట బ్రహ్మసాక్షాత్కారముగల ఆత్మజ్ఞాని అహంశబ్దము తన ఆత్మయందు పరమాత్మ భావనలో సమన్వయపరచుచున్నాడు.

శ్లో॥ స్వతః పూర్ణః పరాత్మాఽత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః।
అస్మీత్యైక్యపరామర్శ స్తేన బ్రహ్మ భవామ్యహమ్॥

టీక॥ స్వతః = స్వాభావికముగా, పూర్ణః = అపరిచ్ఛిన్నుడగు, పరాత్మా = పూర్వోక్తపరమాత్మ, అత్ర=ఈమహావాక్యమునందు, బ్రహ్మశబ్దేన - బ్రహ్మ = బ్రహ్మమనెడి; శబ్దేన = పదముచేత, వర్ణితః = లక్షణావృత్తిచేత చెప్పబడుచున్నాడు. అస్మీతి = ఐతిననెడిపదము, ఐక్యపరామర్శః — ఐక్య = ఏకత్వమును, పరామర్శః = తెలుపుచున్నదగును. తేన = అందుచేత, అహం=నేను, బ్రహ్మ=బ్రహ్మము, భవామి=అగుచున్నాను.

వి॥ దీనియందు చెప్పబడిన బ్రహ్మాకారవృత్తి రూఢమగువఱకు మనన నిదిధ్యాసనాదుల చేయవలయును. సాధకునికి యీరెండువాక్యములే చాలును.

3. "తత్త్వమసి" అనువాక్యమున్ను, 4. "అయమాత్మాబ్రహ్మ" అనువాక్యమున్ను, యీరెండున్ను బోధన వాక్యములగుటచే, అనగా ఆచార్యుండు ముముక్షువులకు బోధించెడు వాక్యములగుటచే ఇచ్చట చేర్చలేదు. వేదాంతపంచదశి, ఐదవప్రకరణమందు దీనిని విశదముగా కనందగును.

శ్లో॥ అపరోక్షాత్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకం।
సంసారకారకాజ్ఞానతమసశ్చండభాస్కరః॥

తా॥ ఆచార్యునివలన తత్త్వమస్యాది వేదాంత విచారద్వారా కలిగిన బ్రహ్మసాక్షాత్కార రూపమగు అపరోక్షజ్ఞానము సంసార కారణ మయిన అజ్ఞానమనెడి చీకటికి మధ్యాహ్నకాల సూర్యునివంటిది యగును.

శ్లో॥ స ఆత్మా సవిజ్ఞేయస్సర్వైరపి ముముక్షుభిః।
తుర్యాత్మజ్ఞాన హీనానాం నముక్తిస్స్యాత్కదాచన॥

తా॥ ముముక్షువులందఱిచేతను ఆ ఆత్మవస్తువే లెస్సగా తెలిసి కొనందగినది. అట్టి తురీయాత్మ జ్ఞానమును పొందనివారు ఇతరములగు యెన్నిసాధనలు చేసినను మోక్షమును బడయజాలరు.

శ్లో॥ శ్రుతేశ్శతగుణం విద్యాన్మననంమననాదపి।
నిదిధ్యాసంలక్షగుణమనన్తం నిర్వికల్పకమ్॥

తా॥ గురుముఖమున వేదాంతవాక్యశ్రవణమును చేయుట యుత్తమము. శ్రవణముకంటె మననము నూరురెట్లధిక ఫలము నిచ్చును. మననముకంటె నిదిధ్యాసనము లక్షమడుంగులధిక ఫలము నిచ్చును. నిదిధ్యాసనముకంటె నిర్వికల్పసమాధి అనన్తఫలము నొసంగును.

(వివేక చూడామణి.)

వి॥ బ్రహ్మవిద్యకు పతనముగల్గుటకు కారణమిచ్చోట నిరూపింప బడినది. ఇప్పుడు ముముక్షువులలో చాలామందియు వేదాంత శ్రవణముచే తృప్తిని పొందుచున్నారు. వారలలో కొద్దిమందిమాత్రమే మననము జేయువారై యున్నారు. నిశ్శేషవాసనారహిత బ్రహ్మసాక్షాత్కారమువఱకు నిదిధ్యాసనమును చేయువారు అరుదయిరి. అందుచేతనే పూర్వఋషులయొక్క స్థానమును యిప్పుడుండువారు అధిష్ఠించలేక పోవుటకు హేతువు.

శ్లో॥ ప్రథమం శ్రవణం కృత్వా ద్వితీయే మననం తథా।
నిదిధ్యాసనకం పశ్చాత్సాక్షాత్కారస్తదా భవేత్॥

అని కపిలమహర్షి వచనము, 1. మొదటశ్రవణము, 2. మరల మననము, 3. నిదిధ్యాసనము. ఈ నిదిధ్యాసమందుమాత్రమే బ్రహ్మ

సాక్షాత్కారముగల్గును. అప్పుడే యీ బ్రహ్మవిద్య పూర్తియగును. అట్లుగానిచో అపూర్ణమే యగును.

శ్రుతి॥ శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః
శృణ్వన్తోఽపి బహవో యం నవిద్యుః।
ఆశ్చర్యోవక్తా కుశలోఽస్య లబ్ధాఽ
శ్చర్యోజ్ఞాతా కుశలానుశిష్టః॥

తా॥ ఈ బ్రహ్మతత్త్వమునుగుఱించి వినుటకైనను అనేకవేల జనులలో ఒక్కడైనా లభించుట దుర్లభము. ఆలాగున వేలకొలది శ్రవణముచేయువారలలో అట్టిఆత్మను తెలిసికొనినవాడు దుర్లభుడు. ఈ బ్రహ్మమునుగూర్చి చెప్పువాడుగూడ లభించుట ఆశ్చర్యము. అనగా దుర్లభుడు. ఒకవేళ చెప్పువాడు దొరికినను నిపుణుడు లభించుటకూడ పరమాశ్చర్యము. అనగా దుర్లభుడు. ఒకవేళ అట్టివాడుదొరికినను బ్రహ్మనిష్ఠుల పరంపరానుగతముగల అనుష్ఠానముగలవాడును దొరకుట దుర్లభము. అదియు ఆశ్చర్యమే. కావుననే బ్రహ్మజ్ఞానము అభివృద్ధికి వచ్చుటకు మార్గములేకపోవుటకు కారణము. మరియు ప్రపంచములోగల న్యాయవ్యాకరణజ్యోతిషాది విద్యలనన్నిటిని అభ్యసించి పూర్ణత్వము నొందుటకు అన్తఃకరణశుద్ధి, విషయవిరక్త, సత్యవచనము, ధర్మానుష్ఠానము, శమదమాదిగుణములు కల్గియుండవలయునని నియమములేదు. కాబట్టియే అట్టిశాస్త్రములలో అధికజనులకున్న ప్రవేశము గల్గుటకు కారణము. ఈ బ్రహ్మవిద్యయో అట్టిదికాదు. ప్రారంభములోనే బ్రహ్మచర్యము, తపస్సు, చిత్తశుద్ధి, మనస్సుయొక్క ఏకాగ్రత, విషయవైరాగ్యము గల్గవలయునని విధించుటచే దీనియందు సామాన్యజనులకు ప్రవేశములేకపోవుచున్నది. పూర్వపుణ్యముచేఆత్మశుద్ధిగలవారై దైవానుగ్రహము గలిగినవారికిమాత్రమే దీనియందు అభిలాషజనించును. అయితే ఇది యింతప్రయాసముగానుండినను దీనిఫలమునకు అంతప్రభావము గలదు. తక్కినవిద్యలు ఇంతప్రయాసము లేనందుచేతనే వానిచే గల్గెడు ఫలము స్వల్పమగుటకు కారణము. అందుచేతనే శ్రీకృష్ణభగవానుడు కూడ "అధ్యాత్మ విద్యా విద్యానాం" అని వాక్రుచ్చియున్నాడు. విద్యలన్నిటిలోను బ్రహ్మవిద్యగొప్పదనియు, అదిసాక్షాద్విష్ణుస్వరూపమనియు

చెప్పుటకు కారణము. మఱియు గీతలో శ్రీభగవానుడు స్వయముగా యటులవచించెను.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తితత్త్వతః॥

తా॥ మనుష్యులలో, వేలకొలది సంఖ్యలలో ఒకానొకడు ఆత్మజ్ఞానముకొఱకు యత్నించుచున్నాడు. అట్లు యత్నశీలురులలో ఒకానొకడు మాత్రమే నిర్విఘ్నముగ అభీష్టసిద్ధిని పూర్తిచేయుచున్నాడు. అట్లు సిద్ధిని పొందినవారలలో ఒకానొకడు మాత్రమే నిజముగా పరమాత్మను తెలిసికొని ముక్తుడగుచున్నాడు. నిర్వికల్పసమాధియందు, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమందు అహంప్రత్యయముగలదా? లేదా? అనువిషయమై శ్రీశంకరాచార్యులవారియనుభవవాక్యమున్ను, శ్రుతిస్మృతులయాశయమున్ను తెలుపబడెను. ఇకఈవిషయమై శ్రీయోగవాసిష్ఠమునగల వసిష్ఠమునీంద్రుల యాశయమున్ను తెలిపెద.

శ్లో॥ త్రివిధో రాఘవా స్తీహ త్వహంకారో జగత్త్రయే।
ద్వౌశ్రేష్ఠావితరస్త్వాజ్యః శృణు త్వం కథయామి తే॥

తా॥ ఓ రామా! ఈజగంబున మూడువిధములగు యహంకారములు గలవు. వానిలో మొదటివి రెండును శ్రేష్ఠములు. మూడవది శ్రేష్ఠముగాదు. అయ్యది త్యజింపదగినది. వాటినిగూర్చివచించుచున్నాను, వినుము.

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం పరమాత్మాఽహమచ్యుతః।
నాన్యద స్తీతి పరమా విజ్ఞేయాసాహ్యహంకృతిః॥

శ్లో॥ మోక్షాయైషా నబన్ధాయ జీవన్ముక్తస్య విద్యతే।

తా॥ ఈజగత్తంతయు పరమాత్మమయమే. అట్టి పరమాత్మయే నేను. నాకన్యముగ జగత్తనునదే లేదు, అను నీ యహంకారము సర్వోత్తమమని యెఱుంగవలెను. ఈయహంకారము మోక్షమునే గలుగజేయునుగాని బన్ధమునుగాదు. ఇయ్యది జీవన్ముక్తున కుండును.

శ్లో॥ సర్వస్మాద్వ్యతిరిక్తోఽహం వాలాగ్రశతకల్పితః॥
ఇతియా సంవిదేషాఽసౌ ద్వితీయాహంకృతిశ్శుభా।
మోక్షాయైషా నబన్ధాయ జీవన్ముక్తస్య విద్యతే॥

తా॥ నేనన్నిటికంటె భిన్నమై (సాక్షిస్వరూపుడనై) కేశాగ్ర భాగముయొక్క నూఱవభాగముకంటెను సూక్ష్మమై యున్నాను. ఇట్టి మనోనిశ్చయమున్ను శుభాహంకృతియే యగును. ఈ రెండవయహంకార మున్ను మోక్షమునే కలుగజేయును; బన్ధమును కాదు. ఇదియు జీవన్ముక్తునకుండవచ్చును.

వి॥ ముందు జెప్పబడినది అద్వైతము ననుసరించి, యీ రెండవది ద్వైతవిశిష్టాద్వైతముల ననుసరించి యని గ్రహించుకొనవలయును. శైవ వైష్ణవ సాంఖ్యయోగాది మతములన్నియు యీపద్ధతినే యనుసరించి యుండును.

శ్లో॥ అహంకారాభిధాయాసా కల్ప్యతే నతు వాస్తవీ।
పాణిపాదాది మాత్రోఽయమహమిత్యేవనిశ్చయః॥

శ్లో॥ అహంకార స్తృతీయోఽసౌ లౌకికస్తుచ్ఛ ఏవసః।
వర్జ్య ఏవ దురాత్మాఽసౌ శత్రురేవ పరస్స్మృతః॥

తా॥ నిర్వికల్ప సమాధియందున్న వారికీ రెండహంకారములు కేవలము కల్పనామాత్రములేగాని, వాస్తవములుగావు. అవి వ్యవహారముకొఱకుమాత్రము ప్రయోగింపబడినవి. ఇక హస్తపాదాది యుక్తమగు దేహముమాత్రమే నేనను నిశ్చయము లౌకికమును, తుచ్ఛమును నగు మూడవ యహంకారమనబడును. ఇది నీచమైనది. మఱియు నియ్యది ఆత్మజ్ఞానమునకు ప్రబలశత్రువని వచింపబడినది. గాన త్యజింపదగును.

వి॥ ఈ మూడవయహంకారము తప్పక బన్ధముగలుగజేయును. ఇది ముముక్షావస్థలో యుండువారికైనను యుండకూడదు.

శ్లో॥ కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ బద్ధ్యతే॥

తా॥ నేను దుర్బలుడను, అతిదుఃఖిని, బద్ధుడను, హస్తపాదావయవ సహితుడనని తన్ను భావించుచు, తదనురూపముగ వ్యవహరించుచునుండు జీవుడు బన్ధనమున తగుల్కొనును.

శ్లో॥ నాహం దుఃఖీ నమే దేహో బంధఃకస్యాత్మనః స్థితః।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే॥

తా॥ నేను దుఃఖనిగాను, నాకు దేహమే లేదు, ఇక బంధ మెవ్వనికి అను నిట్టి యుత్తమభావనలగల్గి వ్యవహరించువాడు ముక్తుడగును.

శ్లో॥ సంశాన్తాహం కృతేర్జన్తో ర్భోగారోగామహామతే।
నస్వదన్తే సుతృప్తస్య యథా ప్రతి విషారసాః॥

తా॥ మహామతివగునో రామా! అహంకారముశమించిన పూర్ణ తృప్తుడగుజ్ఞాని భోగములన్నిటిని రోగములుగ తలంచును. అదెటులనగా విషమి శ్రితరసమువోలె రుచింపకుండును. అనగా పాచిపోయిన క్షీరాన్నమునువలె తలంచును.

శ్లో॥ తస్మాద్వాసనయాబద్ధం ముక్తం నిర్వాసనం మనః।
రామ నిర్వాసనీభావ మహారస్వ వివేకతః॥

తా॥ కాన, నోరామా! వాసనాయుక్తమగు మనస్సు బద్ధముగను, వాసనా రహితమగునది ముక్తమును నగును. అందుచే నీవవశ్యము వాసనారాహిత్యమును కలుగజేసి కొనుము.

శ్లో॥ సమ్యగాలోకనాత్సత్యాద్వాసనా ప్రవిలీయతే।
వాసనావిలయేచేతః శమమాయాతి దీపవత్॥

తా॥ సత్యవస్తువును బాగుగ విచారించుటచే వాసనలు లెస్సగ నివర్తించును. వాసనలునశించుటచే మనస్సున్ను, తైలమునశించిన దీపమువలె ప్రశమన మొందును.

శ్లో॥ మనోనిర్మలతాం యాతం శుభసన్తాన వారిభిః।
బ్రాహ్మీంద్దృష్టిముపాదత్తే రాగం శుక్లపటో యథా॥

తా॥ శుభ్రముచేయబడిన తెల్లనివస్త్రము రంజకద్రవ్యవర్ణమును గ్రహించునట్లు సమాధ్యభ్యాసజనితమగు ధర్మవృద్ధియను జలముచే నైర్మల్య మొందిన మనస్సు బ్రహ్మసంబంధమగు దృష్టిని గ్రహించును.

శ్లో॥ ఆత్మైవేదం జగదితి వినాభావేన దుఃఖదా।
దృశ్యశ్రీరన్యథా త్వేషా భోగమోక్షప్రదాయినీ॥

తా॥ ఈజగత్తంతయు ఆత్మస్వరూపమే యనుభావము గల్గియుండనిచో, దృశ్యము దుఃఖప్రదమేయగును. కాని అంతయు ఆత్మస్వరూపమేయను జ్ఞానముచే నయ్యది ఇహపర సౌఖ్యముల రెండింటిని ప్రసాదించును. (భుక్తిముక్తులను గలుగజేయును.)

వి॥ జీవన్ముముక్తులకు దృష్టాదృష్ట ఫలములు రెండు యుపనిషత్తులలో వర్ణింపబడియె. ఇహములో తనకు కావలసిన సర్వసౌఖ్యములున్ను, తానుతలంచిన కార్యములన్నియు సిద్ధించును. పరమందు ముక్తియు సిద్ధించును. ప్రాకృతజనులు పరమును తెలిసికొనజాలరు. వారికి వర్తమానస్థితిమాత్రమే గోచరించును. కావున బ్రహ్మనిష్ఠునికిగల ప్రభావము సిద్ధులనుచూచియైనా వారు జ్ఞానమార్గములో ప్రవర్తింపగలరనితలంచియే ఈశ్వరుండాలాగునచేయుటకు కారణము. మఱియు బ్రహ్మనిష్ఠులలో కొందఱు మందబుద్ధి గలవారైనచో, ఈశ్వరుని కరుణచే యట్టి దివ్యావస్థ తనకు గలుగుననితలంచి మఱింతభక్తి శ్రద్ధగలవాడై ప్రవర్తించుటకు అనుకూలముగలవాడగును. ఇచ్చటనే యింతప్రభావము సర్వేశ్వరుడు గలుగచేయుటచే యికమోక్షమునకున్ను యేలాటికొఱంతయు గలుగదని దృఢ విశ్వాసముగల్గుటకు ఇది హేతువగును.

ఓమ్ తత్ సత్.

---

ఓమ్.

# నిర్వాణ ప్రాప్తికాలము.

శ్లో॥ ముక్తి రేషోచ్యతేరామ బ్రహ్మైతత్సముదాహృతమ్।
నిర్వాణమేత త్కథితం శృణు తత్ప్రాప్యతే కథమ్॥

తా॥ రామా! ముక్తియని చెప్పబడునదే బ్రహ్మము నిర్వాణము గూడనై యున్నది. దీనిని బడయగలయుపాయమును చెప్పెదవినుము. నిర్వాణమనియు, ముక్తియనియు, బ్రహ్మసాక్షాత్కారమనియు ఒకే యర్థమని మొదటనే తెల్పబడినది. దీనియొక్క ప్రాప్తికాలనిర్ణయము ఎవరును నిశ్చయించియుండలేదు. ఏలననగా! పూర్వజన్మ సంస్కారము ననుసరించి యదియుండును. పూర్వజన్మములో చాలవరకు పరిపక్వస్థితికి వచ్చియుండు ఆత్మయైనచో, యీజన్మములో త్వరలోనే సిద్ధించును. వామదేవుడు, శుకుడు, గర్భములోనేయుండి బ్రహ్మసాక్షాత్కారమును పొందినటుల శాస్త్రములోగలదు. కపిలవ్యాసాదులు, జన్మమునుండియే

తపోవనమున కేగి, జీవన్ముక్తినిబడసిరి. విశ్వామిత్రయాజ్ఞవల్క్యాదులు కొంతకాలము, గృహస్థాశ్రమములోనుండి మరల తపోనిష్ఠులై మోక్షమును బడసిరి. అదెటులన శ్రీ తిరుపతి వేంకటేశ్వర దర్శనార్థమై చనువారు 7 కొండలను ఎక్కవలయును. ఒకడు 7 కొండలనుయెక్కి సాయంకాలమునకు దేవాలయము దగ్గరకు జేరెను. మఱియొకడు 6 కొండ లెక్కినప్పటికి సూర్యుడ స్తమించెను. ఆతడు రాత్రియచ్చోటనే మండపములో నుండిపోయెను. ఆలాగున మఱియొకండు 5 కొండలను ఇంకొకడు 3 కొండలను వేఱొకడు 1 పర్వతమును ఇతరుడొకడు శేషాచలముయొక్క అడుగుభాగమునునుండెను. మరుసటిదినమున సూర్యోదయము వెంటనే, శ్రీ వేంకటేశ్వర దేవాలయము తలుపుతీయగానే, నిన్నటిదినమున దేవాలయము దగ్గరకువచ్చియుండువానికి వెంటనేదర్శనమాయెను. 6-వ కొండలోనుండువాడు వచ్చునప్పటికి 8 గంటలసమయమాయెను. ఆ దేరీతిగా క్రింద క్రిందయుండువారు వచ్చుటకు కాలమధికమయినటుల యీనిర్వాణప్రాప్తికిగూడ పూర్వజన్మములో సప్తజ్ఞాన భూమికలయందు యెంతవఱకు వచ్చియుండెనో మరలీజన్మమున యచ్చోటనుండి ప్రయాణము చేసిన చాలును. ఒక్కొక్క జ్ఞానభూమికలో ప్రవేశించినవారికి అంతకంతకు ప్రకృతి రాహిత్యమున్ను నిర్విషయత్వమున్ను ఆత్మప్రకాశమున్ను గల్గియుండును. అదేదానికి గుఱుతు. ఈరీతిగా యోగమార్గములోగూడ పూర్వజన్మములోగల సంస్కారపరిణామము ననుసరించి ప్రత్యాహార ధారణధ్యానములోగూడ ఎంతవరకు వచ్చియుండునో, యంతత్వరితముగను యాలస్యముగను నిర్వాణము సమాధిస్థితిగల్గుటకున్ను కాలముయొక్క హెచ్చుతగ్గులు పట్టును. ఈలాగున యున్నతవిద్యాభ్యాసములోగూడ యుంటున్నదికదా? ఒకకాలేజిలో చేరిన విద్యార్థులలో కొందరిదివరలో బి.ఎ. కాని మఱి కొందఱు యఫ్.ఎ.కాని వేఱుకొందఱు మెట్రిక్యులేషన్ ఇకకొందఱు దానికన్నక్రింద తరగతిలోను చదివియుండిన విద్యపూర్తియగు ఎం.ఎ. ప్యాసు కావలసియుండిన కాలమార్పు యేలాగునగల్గియుండునో, ఈబ్రహ్మవిద్యపూర్తియగు మోక్షములోను, యంతపరిణామ వ్యత్యాసములుండును. కావున జ్ఞానశాస్త్రమగు సప్తజ్ఞానభూమికలయొక్కయు యోగ శాస్త్ర

మగు అష్టాంగయోగములయొక్కయు, స్థితులనుగూర్చి విచారించిన మనమిప్పుడు సప్తజ్ఞానభూమికలలో యేభూమికయందుంటున్నాము. ఆలాగున అష్టాంగయోగములలో ఎంతవరకువెళ్ళియున్నాము. అను సంగతి తెలిసికొన వచ్చును. ఇదియే శాస్త్రవిచారణచేగలెడు యుప యోగము. ఎట్లన మనమొక దూరప్రయాణముజేయుచుండిన మనము చదివియుండిన యిప్పటికి ఎన్నిమైళ్ల దూరముగా వచ్చితిమి అను విషయ మును మైలురాతిలోగల లెక్కను చూచితెలిసికొనవచ్చునుగదా! అది యునుగాక నాల్గుమార్గములుచేరిన స్థలములలో వ్రాసిపెట్టిన చే చూపెడు పలకపై ఈమార్గము పలానిప్రదేశమునకు పోవుచున్నది అది యిచట నుండి యెన్నిమైళ్లు దూరముగా నుంటున్నదని యెటుల తెలిసికొన వచ్చునో, యింతమాత్రిమె విద్యచే ఉపకారముగల్గును. అయితే మైలులెక్కనుమాత్రిమెఱింగినచాలదు. అంతదూరము నడవవలయును. అట్లగుచో, మాత్రిమే గమ్యస్థానమును చేరగలము. ఆలాగున విద్యను మాత్రిము చదివిన మాత్రము చాలదు. దానిలోచెప్పినటుల యాచరింప వలయును. అప్పుడే అదిప్రయోజనపడును అనికూడ, ముముక్షువులు జ్ఞాపకములోనుంచి ప్రివర్తించవలయును. మోక్షవిషయకాలనిర్ణయము జేయసాధ్యపడదనియే సర్వశాస్త్రములును ఐకకంఠ్యముగా చెప్పు చున్నవి. గీతయందు శ్రీకృష్ణభగవానుడున్ను యీలాగుననేవచించెను.

శ్లో॥ యదా తేమోహాకలిలం బుద్ధి ర్వ్యతి తరిష్యతి॥
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥

దీనియర్థమిదివరలో వ్రాయబడినదియే "యదా తే మోహాకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి" అనిచెప్పటచే యెప్పుడైతే యజ్ఞాన కలుషిత మోహామునుండి బుద్ధి దాటిపోవునో, యప్పుడే ప్రకృతినుండి విముక్తిని పొందగలదు.

శ్లో॥ నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥

తా॥ ఈలోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పావన మైనదియు, మఱియొకటి లేదు గదా। అట్టిజ్ఞానమును అనుష్ఠానముచే యోగసిద్ధినిపొందినవాడు కాలమాసన్నమగునప్పుడు తనయందు తనం

తటనే పొందుచున్నాడు. ఇచ్చోటను యనుష్ఠానముచే కాలము పరిపక్వమగునప్పుడు తనలో జీవబ్రహ్మల ఏకత్వమను జ్ఞానముగలుగునని తెలుపబడమైనది. తన నేత్ర రోగమును యిచ్చటనే బాగుపరచకపోయిన మరి యే కాశిబదరికాశ్రమాదిస్థలములోనికి వెళ్ళినను అచ్చటను యేలాగునయేమియు చూడజాలడో ఆలాగున పుణ్యాశ్రమములు గాని, పుణ్యక్షేత్రములుగాని, పుణ్యవనములుగాని వెళ్ళినను అంధుడేలాగున చూడజాలడో అట్టిస్థితియే వీరికిగూడ కల్గును. అయితే నేత్రరోగనివృత్తి కొఱకెచ్చటయనుకూలమో యంతమాత్రము చూచుకొనవచ్చును. అంతియే విశేషముగాని నేత్రవ్యాధి చికిత్సచేసికొనక ఎచ్చటనుండినను లాభములేదనిమాత్రము తెలిసికొనవలయు.

శ్లో॥ శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్నిపరితాపితః।
జీవస్సర్వమలాన్ముక్తస్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్॥

తా॥ సాధన చతుష్టయ సంపన్నుడై శ్రవణ, మనన, నిది,ధ్యాసనాదులచే మిక్కిలి ప్రకాశింపజేయబడిన జ్ఞానమను తేజస్సుచేత శోధింపబడిన జీవాత్మ సమస్తసంసారములకు హేతువైన యజ్ఞానమువలన విడువబడినవాడై మలినబంగారము స్ఫుటము జేయునప్పుడు మాలిన్యము నశించి స్వయముగా శుద్ధబంగారమై ప్రకాశించునటుల యుండునని ఆత్మవిషయములో తెలిసికొనదగినది.

శ్లో॥ సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే।
అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తంభాను మంధవత్॥

తా॥ ఆత్మజ్ఞానమను నేత్రముగలవాడు సమస్తమందు వ్యాపించియుండు సచ్చిదానంద స్వరూపాత్మను తననుగా జూచుచున్నాడు. దేహాదులే ఆత్మయను అజ్ఞాననేత్రముగలవాడు ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాడువలెనే చూడకపోవును.

వి॥ అన్ధునకు సూర్యుడు కనుపింపకపోయినను నేత్రముగలవారికి కానుపింపక పోవునా!

శ్లో॥ వివిక్తదేశఆసీనో విరాగో విజితేన్ద్రియః।
భావయే దేకమాత్మానం త మనంత మనన్యధీః॥

తా॥ ఏకాన్త ప్రదేశమునకూర్చున్నవాడై, దేనియందును ఆశలేనివాడై, ఇన్ద్రియములను జయించినవాడై, ఆత్మవ్యతిరిక్తవస్తువు నందు మనస్సును పోనీయనివాడై, ఏకమైనట్టి దేశ, కాల, వస్తు, పరిచ్ఛేదశూన్యుడైన సత్యజ్ఞానానంద స్వరూపమగు బ్రహ్మము ఆత్మగ దృఢము గలుగువరకు ధ్యానముజేయవలయు. అనగా భావించవలయు.

శ్లో॥ అవచ్ఛిన్నఇవాజ్ఞానా త్తన్నాశే సతికేవలః।
స్వయంప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేఽంశుమానివ।

తా॥ అజ్ఞానమువలన పరమాత్మ తనయాత్మకన్యుడుగా తోచబడుచున్నాడు. అవిద్యయొక్క వినాశముగలుగుచుండగా అద్వితీయుడగుచు మేఘావరణము వదలిపోయినపుడు సూర్యునివలె తాను స్వయముగా వెలుగుచున్నాడుకదా! ఇచ్చట సూర్యుని యెవరున్ను వెలిగించ పనిలేదు. అయ్యది స్వయంప్రకాశమైయున్నది. గాలిచే మేఘము వదలి పోయినచాలును. ఆలాగున ఆత్మస్వయంప్రకాశమైనది. అవిద్యావరణమువలన ప్రకాశించుటలేదు. కావున అన్తఃకరణములోగల అజ్ఞానదోషమును విచారణజ్ఞానముచే తొలగించినచాలును. అనిఆత్మబోధము గీతలోను శ్రీ కృష్ణభగవానుడీలాగున తెలుపుచున్నారు.

శ్లో॥ "ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్"

తా॥ మిక్కిలి పట్టుదలతో ధ్యానానుష్ఠానముల జేయుచున్న యోగనిష్ఠుడు సంపూర్ణాంతఃకరణ శుద్ధిగలవాడై అనేక జన్మములయందు అభ్యసించుటవలన పొందదగిన యోగనిష్ఠను పొందుచున్నాడు. అందువలన సర్వోత్తమమగు ముక్తిని బడయుచున్నాడు. దీనివలనను ముక్తి విషయమై కాలనిర్ణయము లేదనియు, అయ్యది తన ప్రయత్నము ననుసరించియుండుననియు తెలియదగినది. మనము కాశ్యాది దూరప్రదేశమునకు ప్రయాణము చేయవలసియున్న పాదచారులమై, లేక ఎద్దుబండ్లలో ప్రయాణముజేసిన, చాలారోజులుపట్టును. రైల్వేప్యాశింజేరైన పైజెప్పిన దానికన్న త్వరలోను, మ్యెల్ యయిన దానికన్న శీఘ్రముగాను, విమానమయిన అతిత్వరలోను, ఎటుల చేరగలమో, ఆలాగున మనయొక్క భక్తి వైరాగ్య తీవ్రానుష్ఠానములబట్టి త్వర

లోనే, మోక్షమును పొందవచ్చును. ఈ లాగుననే, యోగకర్తయగు పతంజలిమునియు నుపదేశించెను.

సూ॥ సతు, దీర్ఘ కాల, నైరన్తర్య, సత్కార, సేవితో దృఢభూమిః॥

టీక॥ సతు = ఆ యోగసిద్ధియన్ననో, చాలకాలము వఱకును, ఎడతెగకను, తపముచేతను, బ్రహ్మచర్యముతోడ శ్రద్ధతోడను, విద్య చేతను, అనుష్ఠింపబడినదై దృఢస్థితి గలదిగానగును. ఇందువల్లను, యోగారూఢస్థితి గలుగవలసియుండిన, చిరకాలానుష్ఠానముండవలయు నని విశదమగుచున్నది.

సూ॥ తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః॥

తా॥ అట్టి ఆత్మభావనలో మనస్సును స్థిరమగుటకు ధ్యానధారణా దులలో ఎడతెగని ప్రయత్నము గల్గియుండుటయే అభ్యాసము.

సూ॥ నిర్విచార వైశారద్యేఽధ్యాత్మ ప్రసాదః॥

తా॥ నిర్విచార సమాధియందు స్థితిగలుగగా యోగికి అధ్యాత్మ ప్రకాశముగలుగును. రజస్తమోగుణముల యాధిక్యతచే, నపరిశుద్ధియు, ఆవరణరూపమగు మురికియు దొలగి పోయినందున స్వప్రకాశమగు నాత్మ ప్రకటితమగును.

సూ॥ తజ్జస్సంస్కారోఽన్య సంస్కార ప్రతిబంధీ॥

తా॥ ఆ నిర్విచార ధ్యానముచే గలిగిన శుద్ధసంస్కారము చిత్త విక్షేపమునకు కారణమగు జన్మ జన్మాంతరములనుండి వచ్చుచుండు రజస్తమములతో గూడిన ప్రకృతి సంస్కారములను తిరస్కరించును. అనగా దగ్గఱకు రానీయక తొలగించును. ఇదియే ఆచరణచే గలిగెడు ఫలితము.

సూ॥ తస్యాఽపినిరోధే సర్వనిరోధాన్నిర్బీజ స్సమాధిః॥

తా॥ ఆత్మ ప్రజ్ఞాజన్య జ్ఞానసంస్కారము దృఢపడగా, పురాతన సంస్కారములన్నియు నిరోధింపబడుటవలన నిర్బీజ, నిర్వికల్ప సమాధి సిద్ధించును.

సూ॥ సమాధి భావనార్థః క్లేశతనూకరణార్థశ్చ॥.

తా॥ సమాధి భావనాసిద్ధి రూఢిపడిరాగా అవిద్యాది క్లేశములు క్షీణించుచుండును; ఇదియే సాధకులు తమలోచూచుచుండవలసిన విష

యము. శుక్లపక్షచంద్రుడు వృద్ధికిరాగారాగా వెన్నెల ఎక్కువగుటయు చీకటినశించుటయు ఎటులయుండునో, అనుష్ఠానపరులకు అలాగున ప్రకృతి గుణ క్షయమున్ను, సత్త్వాదిజ్ఞానగుణావిర్భావమున్ను, శాంతియు, ప్రసన్నతయు, కలుగవలయును.

సూ॥ యోగాంగానుష్ఠానా దశుద్ధిక్షయే జ్ఞానదీప్తి రావివేకఖ్యాతేః॥

తా॥ యోగాంగానుష్ఠానమువలన, రజస్తమః ప్రయుక్తవిపర్యయ జ్ఞానరూపమలమునశింపగా వివేకఖ్యాతిగలిగి సమ్యక్జ్ఞాన మభివ్యక్త మగును.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥

తా॥ అనేకజన్మములలో ఆచరించుచువచ్చిన అనుష్ఠానబలము వలన అన్తఃకరణముశుద్ధమై, కడపటసమస్తమును వాసుదేవమయమను జ్ఞానము గలవాడగుచు నన్ను పొందుచున్నాడు. అట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుఁడు అనిగీత.

వి॥ ఇచట భక్తులకు నొక సందేహము పొడముట కవకాశము గలదు. అదేమన "బహూనాం జన్మనామన్తే" అనిచెప్పుటలో అనేక జన్మములు జరిగిన పిమ్మట జ్ఞానముగల్గి ముక్తి సిద్ధించునని చెప్పుటలో ఇప్పుడెచట మోక్షము గల్గును. లేక ఒకే జన్మములో గలుగునదా మోక్షము అనిచెప్పువారు గూడగలరు. దీనివల్ల తనతీవ్ర వైరాగ్యాను ష్ఠానమునకు యాటంకముగలుగును. దీనియర్థమదిగాదు. అనేకజన్మముల నుండి పుణ్యకర్మ దైవానుష్ఠానముచేసి వచ్చినందుచే యిప్పటికి విషయ ములో విరక్తిగల్గి అన్తఃకరణ శుద్ధిగల్గి జ్ఞానము పొందవలయునని దృఢ బుద్ధిగలిగినటుల తలంచవలయు. ఇప్పుడు మోక్షద్వారము దగ్గఱకువచ్చు వారికి ఇక ఆవరణమను యొకదోషము మాత్రమే గలదు. అనగా సంకల్పరాహిత్యముగల్గి స్వప్రబోధము యుదయించినజాలును. దానికి ఓంకారముగాని, మహావాక్యముగాని నిశ్చింతతో ఏకాన్తమున కొద్ది కాలమునుండి ధ్యానమొనరించినచాలును. మఱియు తానుపొందదలంచిన యుద్యోగమెంతగొప్పదో, దానికి అంత ఎక్కువ కాలము జరుపవలసి యున్నదిగదాయని ముముక్షువులు హృదయముననుంచి యనుష్ఠానము

జేయవలయు. మఱియు ఏ వృక్షమునుండి యెక్కువఫలము యెక్కువ కాలమువరకుగల్గునో అదిఫలించుటకున్ను ఎక్కువకాలము పట్టునుగదా! కూరగాయలచెట్లు, వంగ, బెండ, మొదలయినవి. త్వరలో ఫలించును. ఫలమున్ను స్వల్పము. అరటిచెట్టు సంవత్సరమునకు ఫలమిచ్చును. ఇది పై జెప్పిన కూరగాయలచెట్లకన్న ఎక్కువవిలువను గలుగజేయును. పనస, మామిడి, కొబ్బరి, చెట్లు ఫలించుటకు మరింత ఎక్కువకాలము పట్టును. ఇవి ఫలములను యివ్వప్రారంభించిన చాలాసంవత్సరములు ఫలమునిచ్చు నవేగాక, అధికవిలువనుగూడ గలుగజేయును. కావున మనహృదయములో పెట్టినది బ్రహ్మబీజము. ఇది ఫలింపప్రారంభించిన అనన్తానందమగు జ్ఞానఫలము. అనన్తకల్పములు దాటిపోయినను తరుగని బ్రహ్మానందము నిచ్చునుగదా. దీనియొక్క మహిమాతిశయము తెలిసికొనిన మనమిప్పటికిచేసిన త్యాగము అనుష్ఠానము చాలస్వల్పమని అర్థమగును. మఱియు కారణరూపమగు వృక్షమునుండి యేర్పడిన కార్యరూపమగు బీజము. మరల కారణరూపమగు వటవృక్షమై మారుటకు ఎంతకాలము పట్టునో మీరే యూహించుకొనవచ్చును. అదియునుగాక బీజము పంచభూతాత్మమగుటచే పంచభూతముల సహాయమున్ను గలుగవలయు. ఇచట పంచశీలములు. 1. వైరాగ్యము, 2. భక్తి, 3. ధ్యానము, 4. వేదాంతవిచారణ, 5. తపస్సు ఇవిసరిగానుండిన మాత్రమే పూర్ణత్వము పొందగలము. వృక్షమునకేలాగున భూసత్త్వము, జలసత్త్వము, అగ్నిసత్త్వము, వాయుసత్త్వము, ఆకాశసత్త్వము, ఎటులవసరముల్లో జీవత్వోపాధి పోయి పూర్ణబ్రహ్మ ప్రబోధము గలుగుటకున్ను పై జెప్పిన యైదు సాధనములున్ను గల్గియుండవలయునని ముముక్షువులు నిరన్తరము జ్ఞాపకములోనుంచి అనుష్ఠించవలయును. దీనియందు మరియొక రహస్యముగూడ గలదు. వృక్షశాస్త్రప్రకారము ఒక్కొక్కచెట్టున్ను ఇంతకాలమునకు ఫలించునని నియమముగలదు. అయితే సరియగు పోషణలేనిచో పురుగుల యొక్కగాని పసువుల యొక్కగాని బాధగలిగిన ఫలించుటకు మఱింత ఎక్కువకాలముపట్టును. ఆలాగున మీ యాచరణలలోకొంత జనించినను ప్రకృతిగుణములగు పురుగులు హృదయమున ప్రవేశించినను క్రోధాదులగు పసువులు మేసిపోయినను మీరనుకొన్న కాలమునకు

బ్రహ్మానందఫలము గలుగదనికూడ జ్ఞాపకములోనుంచవలయును. యతిధర్మసంగ్రహమున తెలిపినది చూడుడు.

శ్లో॥ జపా జ్జ్ఞానా త్తథా ధ్యానాన్నాన్య ద్భిక్షోస్తు శోధనమ్।
తస్మాత్తాని సదా కుర్యా ద్యతి శ్శుద్ధ్యర్థ మాత్మనః॥

తా॥ ఆత్మశుద్ధికొఱకు, ప్రణవాది జపముకన్నను, ఆత్మవిచారణ జ్ఞానముకన్నను, పరమాత్మధ్యానముకన్నను, మించినది నివృత్తి మార్గమందు యత్నించువారికి మఱియొకటిలేదు. కావున యీ మూఁడింటిని తప్పక యెల్లప్పుడును బ్రహ్మనిష్ఠులు చేయుచుండవలయును. ఇచ్చట జ్ఞానశబ్దమునకు ఉపనిషత్పఠనమని అర్థమును గ్రహించుకొనవలయును.

శ్లో॥ యోవై వాఙ్మనసీ సమ్యగ సంయచ్ఛన్ధియా యతిః।
తస్యవ్రతం తపోజ్ఞానం స్రవత్యామఘటాంబువత్॥

తా॥ ఎవడైతే, వాక్, మనస్సులను, బుద్ధితో సహా లెస్సగా సంయమనమొనర్పఁడో, అతని వ్రతము తపస్సు, జ్ఞానము, రంధ్రముపడిన ఘటమునుండి జలము కారిపోవునటుల నశించిపోవును. ఇట్టి సంయమన స్థితిగల్గునప్పుడే, త్రిపుటియొక్క ఏకత్వము సిద్ధించును.

1. మనస్సులో యెటుల తలంచునో, ఆలాగున వాక్కుతో చెప్పుటయు, వాక్కుతో చెప్పినటుల, దేహేంద్రియములచే చేయించుటయు గలిగినప్పుడే సంయుయని చెప్పబడును. ఇంత ప్రయాసము మఱియొకటి లేదు. ఆచరణలో పెట్టినప్పుడే దీనియొక్క ప్రయాసము తెలియునగును. అయితే ఎంతవఱకు వీనియొక్క ఏకత్వము గలుగలేదో అంతవఱకు దీపమును వెలిగించ తలంచువాడు చీకటి గదిలో యొకమూలలో, ప్రమిదయు, ఇంకొక మూలలో వత్తియు, మఱియొక మూలలో చమురున్ను, పెట్టి దీపమును వెలిగించచూచిన, అయ్యది ఎప్పుడైనను వెలుగునా? వెలుగనిచో చీకటి తొలగునా? మనోవాక్కాయ కర్మలు ఏకత్వము లేనివారు, హృదయములో జ్ఞానజ్యోతిని వెలిగించుటకు చేసెడు ప్రయత్నమున్ను అట్టిదే.

శ్లో॥ అబ్రువం యదహం తాత ఆత్మసాక్షిక మంజసా।
నైవస్త్రీ నపుమానేత న్నైవ చేదం నపుంసకమ్॥

తా॥ ఓ నాయనా! నేను ఆత్మసాక్షిగా సత్యముగా, యే యాత్మ

స్వరూపజ్ఞానమును తెలిపితినో, అట్టి పరమాత్మస్వరూపము, స్త్రీయు, పురుషుడు, నపుంసకుడుకాదు. యే యేయుపాధిని యాత్మగ్రహించునో, ఆ యా రూపమును ధరించుచుండును.

శ్లో॥ అపి వర్ణావ కృష్టస్తునారీవా ధర్మకాంక్షిణీ।
తావప్యేతేన, మార్గేణ, గచ్ఛేతాం పరమాంగతిమ్॥

తా॥ తక్కువ జాతిలో, జన్మించినవాడైనను లేక స్త్రీ యైనను ఈజ్ఞానమనెడు ధర్మమార్గమును అనుష్ఠించి వచ్చినచో తప్పక వారున్ను సర్వోత్కృష్టమయిన బ్రహ్మపదమును, పొందగలరు దీనియందు ఏలాటి సంశయము లేదు అని, భీష్ముడు ధర్మజునకు శాంతిపర్వమున ప్రమాణముజేసి చెప్పెను. అట్టివారే మోక్షము పొందగలరు అని చెప్పినప్పుడు, తక్కినవారిని గుఱించి మరల చెప్పవలయునా అని భావము. ఇదేరీతిగా గీతయందు నొక శ్లోకముగలదు.

శ్లో॥ మాం హిపార్థవ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః॥
స్త్రియోవైశ్యా స్తథా శూద్రా స్తేపియాన్తి పరాంగతిమ్॥

ఓ యర్జునా! పాపజన్మముగలవారెవరు గలరో, అట్టివారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను, నన్ను యాశ్రయించి సర్వోత్కృష్టమగు విష్ణుపదమును (మోక్షమును) పొందుచున్నారు. ఇట్లుండగా తదితరులగూర్చి చెప్పవలయునా అని యాహార్థము.

చిరకాల సాధనవల్లనే యోగవాసిష్ఠమున చెప్పబడిన చూడాల గూడ, ఆత్మశాంతిని పొందినట్లు వర్ణించడమైనది.

శ్లో॥ ఇతి సంచి న్తయామాస చిరాయేత్థం వ్యబుద్ధ్యత।
అహోను చిరకాలేన జ్ఞాతం జ్ఞేయ మనామయమ్॥

తా॥ చిరకాలమునకు తర్వాత, ఆ చూడాల ఆత్మ తత్త్వమును (వర్ణింపబోవు విధమున) గ్రహించి ఇట్లనుకొన దొడగెను. ఆహా! ఎట్టి అదృష్టము. నిర్మలమగు జ్ఞానమును చాలకాలమునకు పిదప నేనిపుడు గ్రహింపగలిగితిని.

శ్లో॥ ఆత్మన్యేవాత్మభావేన సర్వవ్యాపి నిరఞ్జనమ్।
చిన్మాత్ర మమలోఽస్మీతి, జ్ఞానాదిత్యేన సశ్యతి॥

తా॥ ఆత్మయందు పరమాత్మ భావనచేయుటచేత నుదయించు

నట్టి సర్వవ్యాపియై, నిరంజనమై, నిర్మలమైనట్టి, చిన్మాత్రమె నేననుజ్ఞాన రూప సూర్యునిచేతనే ఆ యజ్ఞానము నశించును.

శ్లో॥ సర్వ సంగపరిత్యాగః సర్వద్వన్ద్వ సహిష్ణుతా।
సర్వభూత సమత్వం చ మోక్షస్య విధి పుత్రక॥

తా॥ శ్రీ వ్యాసులు తమ ఆత్మ పుత్రుడగు శుకునకు యీ తత్త్వము నుపదేశించెను. ఓ కుమారుడా! మోక్షమునకు, సమస్త సంగమునుండి విముక్తియు, సకల ద్వంద్వములను సహించుటయు సర్వ భూతములయందు సమత్వము గల్గియుండుటయే ముఖ్యకారణమగును. ఇట్టి స్థితి గలుగునప్పుడు మోక్షము కరతలామలకముగ సిద్ధించును.

శ్లో॥ యత్ర రాగాదిరహితా వాసుదేవ పరాయణాః।
తత్ర సన్నిహితో విష్ణు ర్యతస్తీర్థమయోహి సః॥

ఎవరైతే విషయరాగాది రహితులైయున్నారో, ఎవరు శ్రీ వాసుదేవ నారాయణ పరబ్రహ్మపరాయణులైయుందురో, వారియెదుట సాక్షాద్విష్ణుమూర్తియు సాన్నిధ్యముగల్గియుండును. విష్ణుమూర్తియే లాగున తీర్థమయుడో, ఆలాగున అట్టివారుగూడ తీర్థస్వరూపులగుదురు. అనగా ఇతరులను తరింపజేయగలవారగుదురు. అదియును అట్టి వారి సాన్నిధ్యము సర్వతీర్థమున స్నానమాచరించిన ఫలమునుకూడ కలుగ జేయును. ఈ ఆత్మతత్త్వ ప్రాప్తియు చాలాకాలము సాధనమువల్లనే లభింపబడునని శ్రీ వేమన యోగీంద్రుడుగూడ తెలిపెను.

ఆ॥ వెదకి వెదకి వెదకి వేసారి వేసారి
తిరిగి తిరిగి తిరిగి దిమ్మతిరిగి
బొమ్మలాటఁజూచి పోబడి గంటిరా
విశ్వదాభిరామ వినుర వేమా॥

ఆ॥ వెదక వెదక దొరకు వేదాంత వేద్యుండు
వెదకువాని తాను వెదకు చుండు
వెదకనేర్చినట్టి వెరవర్లు గలరొకో
విశ్వదాభిరామ వినుర వేమా॥

ఓమ్ తత్ సత్.

---

ఓమ్.

# నిర్వాణ సుఖము.

శ్లో॥ మిథస్సంపన్న యోర్ద్రష్ట్రి దృశ్యయోరేక సంఖ్యయోః।
ద్వయాభావే స్థితిం యాతే నిర్వాణమవశిష్యతే।

తా॥ పరస్పరసాపేక్షములగు ద్రష్టదృశ్యములు విలయమగుచో, మిగులునదే నిర్వాణము ద్రష్ట్రదృశ్యదర్శనములను త్రిపుటి నశించినస్థితి యేదిగలదో, అదియేనిర్వాణము. అదియే బ్రహ్మసాక్షాత్కారము. త్రిపుటిని గుఱించి యీ గ్రంథముయొక్క ప్రప్రథమమున వ్రాయబడియున్నది. నిర్వాణమనియు, మోక్షమనియు, ఒకేయర్థమను విషయమై యిది వరలో తెలుపబడ్డమైనది కదా దీనియందంత మహిమలేనిచో, రాజాధిరాజులు రాజ్యసౌఖ్యములనన్నిటిని తృణీకరించి వానప్రస్థాశ్రమమునకు వెళ్ళెదరా? వనమున తపశ్చర్యల శీలింతురా? కట్టకడకు ధర్మరాజాదులు సార్వభౌమత్వమును సంపాదించియు ఆఖరున నిర్వాసనాస్థితియగు నిర్వాణమును పొందుటకై వనమునకేగిరి. భారతమహాప్రస్థానపర్వమున చూడనగును. ఆలాగున శ్రీ గౌతమబుద్ధుడు దేవేన్ద్రసుఖమునకుమించిన రాజ్యసౌఖ్యమును తుచ్ఛమని తలంచి భిక్షుకవృత్తి నవలంబించునా? ఆలాగున సర్వశాస్త్రపారంగతులున్ను, సర్వజ్ఞులగు శ్రీ శంకరాచార్యులున్ను, మధ్వాచార్యులున్ను, రామానుజాచార్యులున్ను, పారివ్రాజకమార్గము నవలంబింతురా! అదేరీతిగ వర్తమాన కాలములో నుండిన పాశ్చాత్యవిద్యాపారంగతులును, ప్రజ్ఞానిధులును, సర్వాంగసుందరులును, నవయౌవనారంభాధిష్ఠానకాలమున శ్రీవివేకానందులు, శ్రీరామతీర్థులు అవలంబించిన యత్యాశ్రమమునుగూర్చి యాలోచించుకొనుడు. ఇకను పెక్కండ్రను విచారించిన దీనిలోగల మహిమ గోచరించును. ఈ విషయమై ఉత్కృష్ట శాస్త్రములలోచెప్పిన కొన్ని ప్రమాణవాక్యముల తెలిపెద.

శ్లో॥ నాతః సుఖతరం కించి త్త్రిషు లోకేషు విద్యతే।
వీతతృష్ణస్య కామేభ్యో ము క్త సంగస్య యత్సుఖమ్॥

తా॥ కామాది సమస్తవిషయములనుండి విడువబడినవాడును, ప్రపంచసంగమునుండి విముక్తుడైనవానికిన్ని యెట్టి యాత్మసుఖముగలదో

దానికి సదృశమగు సౌఖ్యము మూడులోకములలోను మఱియొకటి కొంచమైనను లేదు.

శ్లో॥ న తత్సుఖం సురేన్ద్రస్య న సుఖం చక్రవర్తినాం।
యత్సుఖం వీతరాగస్య మునే రేకాన్తవాసినః॥

తా॥ ఏకాంతవాసియై, రాగరహితుడై మౌని (మనన) శీలుడగు మహాత్మునకు యెట్టి బ్రహ్మానంద సుఖముగలదో, అట్టి సుఖము దేవేన్ద్రునికిగాని, చక్రవర్తులకుగాని లేనేలేదు. అట్లుండగా ఇక సామాన్య మనుష్యులగూర్చి మఱి చెప్పవలయునా?

శ్లో॥ రసం బ్రహ్మాపి భేద్యశ్చతృప్తో యః పరమాత్మని।
ఇన్ద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కాకథా॥

తా॥ యే మహాత్ముడు బ్రహ్మానందరసము ననుభవించి పరమాత్మ ధ్యానమందు తృప్తుడగుచున్నాడో, అట్టి మహాత్ముడు దేవేన్ద్రుని గూడ కడుపేదవానివలెను, భృత్యునివలెను, తలంచును. అటుండ మహారాజులస్థితినిగాని, వారలసౌఖ్యమునుగాని గురించి మరల యేమితలంచును.

శ్లో॥ నచేన్ద్రస్యసుఖం కించిన్నసుఖం చక్రవర్తినాం।
సుఖ మస్తి విరక్తస్య మునే రేకాన్తవాసినః॥

శ్లో॥ న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినామ్।
యాదృశం వీతరాగస్య మునే రేకాంతవాసినః॥

తా॥ ఏకాంతమందుండి బ్రహ్మనిష్ఠనుజేయు విషయ విరక్తునకు ఎట్టి ఆత్మసుఖముగలదో అటువంటి సుఖములో కొంతభాగమైనను దేవేన్ద్రునికిగాని, చక్రవర్తులకుగాని లేదు అని శివతత్త్వజ్ఞానము. రెండవ శ్లోకము గురుగీతయందు పరమశివుండు పార్వతికుపదేశించె. రెండింటికి ఒకటే యర్థము. ఈ యాత్మైక జ్ఞానవిషయమై శ్రీ మద్భాగవతమున ప్రహ్లాదుని వాక్యములను వినుడు.

సీ॥ మందార మకరన్దమాధుర్యమున దేలు
మధుపంబు బోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ జనునే తరంగిణులకు

లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిలచేరునే కుటజములకు
పూర్ణేన్దు చన్ద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాన్ద్ర నీహారములకు.

గీ॥ అంబుజోదర దివ్యపాదారవిందచింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు వినుతగుణశీల మాటలువేయునేల॥

తా॥ ఆత్మసుఖముయొక్కయు, ప్రకృతిసుఖముయొక్కయు, భేదమును గురించి యిచ్చోట తెలుపబడుచున్నది. మందార పుష్పములలో గల తేనెను గ్రోలుచుండు తుమ్మెద మంగచెట్లు మొదలగు ముండ్ల చెట్లలోగల బంకకొఱకు వెడలునా? స్వర్గనదియందు విహరించెడు రాజహంసము బురదనీరు నిండిన కాలువలకు వెళ్లునా? లేత మామిడిచిగురులను తినుచుండు కోయిలముండ్లతో కూడిన చెట్లను ప్రవేశించునా? పూర్ణచంద్రుడుదయించు సమయమున చన్ద్రికా రసాస్వాదనమునుజేయు చకోరపక్షి దట్టమైన మంచునుజేరునా? ఆలాగున సాక్షాత్ శ్రీమన్నారాయణ చరణారవిందామృత పానమును చేసెడు చిత్తము ఏలాగున ఇతరవిషయములకై జనును? ఈ పద్యమును బాగుగా ఆలోచించిన యాత్మసుఖమేలాటిదో, ప్రాకృతసుఖమెట్టిదో తెలిసికొనవచ్చును. ఈ విషయమై వేదాంత డిండిమమందు శ్రీ శంకరులు వచించినది చూడుడు.

శ్లో॥ సుఖమల్పం బహు క్లేశో విషయ గ్రాహిణాం నృణామ్।
అనంతం బ్రహ్మనిష్ఠానా మితి వేదాంత డిండిమః॥

తా॥ విషయాసక్తిగలవారికి సుఖము మొట్టమొదట స్వల్పముగా కనుపించినను అనంతరము దుఃఖమధికము. బ్రహ్మనిష్ఠుల కారంభమున స్వల్పముగా క్లేశము కనుపించినను కట్టకడకు కలిగెడు సుఖముఅనన్తము అనివేదాంతభేరి ఘోషించుచున్నది.

శ్లో॥ అసత్యస్సర్వసంసారో రసాభాసాది దూషితః
ఉపేక్ష్యో బ్రహ్మవిజ్ఞేయ మితివేదాంత డిండిమః॥

తా॥ ఈ సమస్తసంసారమును లేనిది అనగా మిథ్యాకల్పితము గాని వాస్తవముకాదు. అందును రసాభాసాది దోషములతో గూడినది.

ఆభాసమనగా మొదటతోచి తరువాతలేనిది రసాభాసమనగా మొదట సుఖకరముగాదోచి చివరకు దుఃఖమునే గలుగజేయును. కనుక సంసారమును ఉపేక్షింపవలయు. బ్రహ్మమును తెలియవలయు నని వేదాంతడిండిమము వేదాంతడిండిమ మనగా వేదాంతమనెడు భేరియనియర్థము. రసాభాసమనగా విషముకలిసిన క్షీరాన్నమువంటిది. మొదట మధురముగా కనపడినను తర్వాత ప్రాణాంతకమగును. విషయసుఖములన్నియు యిట్టివే యని ముముక్షువులు గ్రహించుకొనవలయును. అది ఎఱ్ఱలోపలనుండు గాలమువంటిది. మత్స్యములు మాంసమునభిలషించి మ్రింగుటచే గాలము గొంతులోతగుల్కొని మృత్యువుపాలగునటులనుండును. ఈ విషయమై వాసిష్ఠమున చెప్పినది చూడుడు.

శ్లో॥ దక్షిణాం కకుభం గచ్ఛన్కః ప్రాప్నోత్యుత్తరాందిశమ్
సంకల్పార్థపరైరేవ సంకల్పార్థోఽవగమ్యతే॥

తా॥ దక్షిణదిక్కునకు ప్రయాణమొనరించి ఎవరైనను ఉత్తర దిక్కును పొందగలరా? యెవరు దేనియందు సంకల్పనిష్ఠగల్గియున్నారో, వారు దానిని పొందగలరు. అనగా విషయసంకల్పముగలవారు నిర్విషయులచే పొందదగిన బ్రహ్మము నెటుల పొందగలరు. దక్షిణదిక్కునకు విడువబడిన బాణము ఉత్తరదిక్కులక్ష్యము నెటుల భేదించగల్గును. ఈ విషయమై శ్రీయేసుక్రీస్తు యీలాగున ఒకభుక్తిముక్తి సుఖముకావలయునని యడిగిన జిజ్ఞాసువుకొఱకు చెప్పెను. అదేమన ఒకేరేవునుండి ఏక కాలమున ఉత్తరదక్షిణ ప్రదేశములకు వెళ్ళెడు రెండునావలపై ఒకడు ఎటులప్రయాణముచేయగల్గును. యీఅర్థమును ముముక్షువులుబాగుగా విచారణచేసిన ప్రవృత్తి నివృత్తి మార్గముల సత్యము తెలిసికొనగలరు. శ్రీ కృష్ణభగవానుడు గీతలో యీలాగున చెప్పిరి.

శ్లో॥ యత్తదగ్రేవిషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥

తా॥ సత్యధర్మ బ్రహ్మనిష్ఠాదులు ప్రప్రథమమున విషమువలె విషమస్థితిగా కనుపించినను పరిణామము గలిగి రాగా రాగా అవి అమృత సమానములుగా మారుచుండును. అట్టి పరమాత్మ విషయకమైనబుద్ధి

యొక్క నైర్మల్యమువలన గలిగిన సుఖము సాత్త్వికమని యోగులచే చెప్పబడుచున్నది.

శ్లో॥ విషయేన్ద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజ సంస్మృతమ్॥

తా॥ విషయములచే ఇంద్రియములద్వారా ఏ సుఖము కలుగునో, ప్రథమమున అమృతమువలె కనుపించినను, పరిణామావస్థగలిగి రాగా రాగా అదికాలకూట విషమువలెనగును. అట్టి ఇంద్రియ సుఖము రాజససుఖమని బ్రహ్మవేత్తలచే తలంచబడెను.

శ్లో॥ యేహి సంస్పర్శజాభోగా దుఃఖయోనయ ఏవతే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః॥

తా॥ విషయేన్ద్రియ సంయోగమువలన బుట్టిన సుఖానుభవములు దుఃఖమునకు కారణములయినవి. ఆద్యంతములు గలవి. అని తలంచి నిర్మలబుద్ధిగలవాడు విషయసుఖములపై ఆసక్తి గొనడు. ఆద్యంత మనగా, ఒకక్షణముండి యుత్తరక్షణమున నశించునది. "దుఃఖయోనయః" అని ప్రయోగించుటచే యూరకనే నశించునవేగాక అనేక దుఃఖములను గూడ గలిగించియే నశించునవియని భావము.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వ సక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే॥

బాహ్యవిషయముల యందాసక్తిలేని యే పురుషుడు తనయాత్మ యందు యే సుఖమును పొందుచున్నాడో, అట్టి పురుషుడు బ్రహ్మనిష్ఠ యయిన సమాధితో గూడుకొనిన మనస్సుగలవాడై అక్షయమగు బ్రహ్మానందముననుభవించుచున్నాడు.

శ్లో॥ మాత్రా స్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యా స్తాం తితిక్షస్వ భారత॥

తా॥ ఓ యర్జునా! ఇంద్రియములకు శబ్దాదివిషయములతోడ గలిగెడు సంబంధములు. శీతోష్ణములను తన్మూలకముగా సుఖదుఃఖము లను కలుగజేయునవియు రాకపోకలుగలవియు స్థిరములుగానివియు నగు చున్నవి. కావున వానిని సహించుకొనుము.

వి॥ బ్రహ్మనిష్ఠుల బలమంతయు ద్వంద్వములను సహించు కొనుట లోనే గలదు. లేక స్వరూపస్థితినుండి జారనీయక చూచుటలోనే కన్పడును అటిజ్ఞేయ బ్రహ్మమునుండి యంతఃకరణము లోనికిగాని ఇంద్రియముల లోనికిగాని దేహములోనికిగాని దృశ్యములోనికిగాని జారినచో అదియే సంసారసాగరములోనికి జారిపడుటయని తెలియవలయును. ఇచ్చట తన మనోబలము, సంయమబలము, శ్రవణబలము, చూపందగును. జన బాహుళ్యముగల ప్రధానవీధియందు మోటారునడుపు డ్రైవర్ వలెను గాలివానలో పడవనడుపు చుక్కానివాని వలెను బ్రహ్మనిష్ఠులుండవలయును మోటార్ డ్రైవరు కనురెప్పపాటులో అజాగ్రత్తగలిగిన యేలాగున ప్రమాదమునుజెందునో బ్రహ్మనిష్ఠులదృష్టియు ఆలాగున ఉండవలయు. మఱియు ఆత్మబోధముపదేశించునది చూడుడు.

శ్లో॥ యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నా పరంసుఖమ్।
యజ్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్య వధారయేత్॥

తా॥ ఏ సచ్చిదానంద స్వరూపముయొక్క లాభముకంటే వేఱే యధికమగు లాభములేదో, ఏ బ్రహ్మముయొక్క ఆనందముకంటే వేఱే యధికానందములేదో ఏ బ్రహ్మసాక్షాత్కార జ్ఞానముకంటే వేఱే అధిక మయిన జ్ఞానములేదో అది పరిపూర్ణ బ్రహ్మమని నిశ్చయముగా తెలిసి కొనవలయును.

శ్లో॥ అఖండానందరూపస్య తస్యానందలవాశ్రితాః।
బ్రహ్మాద్యా స్తారతమ్యేన భవన్త్యాన దినోలవాః॥

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వర ఇన్ద్రాదులెల్లరును పరిచ్ఛిన్నా నందమును గలవారుగాను, అల్పానందము గలవారుగను, యుండుట వలన వారి యానందములు. అఖండానందమగు ఆత్మానందమునకు సమములుగావని తెలిసికొనవలయును. ఇప్పుడు బృహదారణ్యకోపనిషత్తు నందు తెలుపబడిన బ్రహ్మనిష్ఠుని యొక్క నిరతిశయానంద సుఖమెటు వంటిదో, నిరూపింపబడుచున్నది. దీనిని తెలిసిన ఋషులుపొందిన బ్రహ్మ సుఖమెట్టిదో, అర్థమగును.

ఉ॥ స యో మనుష్యాణాగ్ రాద్ధః సమృద్ధో భవత్యన్యేషా మధిపతి స్సర్వై ర్మానుష్యై ర్భోగై స్సమ్పన్న తమః సమనుష్యాణాం పరమ ఆనన్దోఽథ యే శతం మనుష్యాణా మానన్దాః స ఏకః పితౄణాం జితలోకానా మానన్దోఽథ యే శతం పితౄణాం జితలోకానా మానన్దాః స ఏకో గంధర్వలోక ఆనన్దోఽథ.

టీక॥ మనుష్యాణాం = మనుష్యులలో, రాద్ధః = సంసిద్ధుడగు, (సమగ్రమైన అవయవములు గలవాడగు) స, యః = ఒకానొకడైన జనుడు, సమృద్ధః = సంపత్తిగలవాడును, (ఉపభోగోపకరణ సంపత్తిగల వాడును) అన్యేషాం = ఇతరులకు, అధిపతిః = స్వతన్త్రప్రభువునై, సర్వైః = సమస్తములయిన, మానుష్యైః = మనుష్యసంబంధములగు, భోగైః = భోగములచేతను, సమ్పన్నతమః = సమ్పన్నులగువారలో అతిశయముగా సమ్పన్నుడగువాడుగ, భవతి = అగుచున్నాడు.

వి॥ ఇది పూర్ణమైన మనుష్యానందముయొక్క పర్యవసాన మగును. అనగా సర్వావయవ సమన్వితుడై, సర్వసౌభాగ్యవంతుడై, సార్వభౌముడై యుండువాని ఆనందము. మనుష్యానందము యొక్క అంతమని గ్రహించతగినది.

అథ = అనన్తరము, మనుష్యాణాం = మనుష్యులయొక్క, శతం = నూఱింతలగు, ఆనన్దాః = ఆనన్దములు, యే = యేవియో, తే = అవి జితలోకానాం = జయింపబడిన లోకములుగల పితౄణాం = పితృదేవతల యొక్క, ఏకః = ఒకటియగు, సః = ఆ, ఆనన్దః = ఆనందము, (భవతి = అగుచున్నది.) అట్టి పూర్ణమనుష్యానందముల నూరురెట్లుగలది పితృదేవతల యానందమగుచున్నది.

అథ = అనన్తరము, జితలోకానాం = జయింపబడిన లోకములుగల, పితౄణాం = పితృదేవతలయొక్క; శతం = నూఱింతలయిన, ఆనన్దాః = ఆనందములు, యే = ఏవియో, (తే = అవి) ఏకః = ఒకటియగు, గంధర్వలోక ఆనందః = గన్ధర్వలోక = గంధర్వలోకముయొక్క, ఆనన్దః = ఆనందము, (భవతి = అగుచున్నది.)

ఈ పితృ దేవతల నూఱురేట్ల ఆనందము. గంధర్వలోకముయొక్క ఒక ఆనందమగుచున్నది. అనగా గంధర్వుల యానందమగుచున్నదని భావము.

ఉ॥ యేశతం గన్ధర్వలోక ఆనన్దాః స ఏకః కర్మదేవానాం
ఆనన్దో యే కర్మణా దేవత్వ మభిసమ్పద్యన్తే॥

టీక॥ అథ = అనంతరము, శతం = నూటింతలయిన, గన్ధర్వలోక ఆనన్దాః = గన్ధర్వలోక = గంధర్వలోకముయొక్క, ఆనందాః = ఆనందములు, యే = ఏవియో, (తే = అవి) యే = ఎవరు, కర్మణా = కర్మచేతను, దేవత్వం = దేవత్వమును, అభిసమ్పద్యన్తే = పొందుచున్నారో, తేషాం = అటువంటి, కర్మదేవానాం = కర్మదేవతలయొక్క ఏకః = ఒకటియగు సః = ఆ, ఆనన్దః = ఆనందము, (భవతి = అగుచున్నది.) గన్ధర్వుల ఆనందము నూరు పాళ్ళుచేరినది కర్మదేవతల ఒక యానందమగుచున్నది. కర్మదేవతలనగా, మనుష్యలోకములో, యజ్ఞాది కామ్యకర్మలచే పొందబడిన దేవత్వము గలవారని భావము.

అథయేశతం కర్మదేవనా మానన్దాః స ఏక, ఆజాన దేవా-
నామానన్దో యశ్చ శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథ॥

అథ = అనన్తరము, కర్మదేవానాం = కర్మచేత దేవత్వముపొందిన వారలయొక్క, శతం=నూటింతలయిన, ఆనన్దాః =ఆనందములు, యే = ఏవియో (తే = అవి) ఆజానదేవానాం = ఆజాన దేవతలయొక్క (పుట్టుటతోడనే దేవత్వమును పొందినవారు ఆజానదేవులనబడుదురు.) ఏక = ఒక్కటియగు, సః = ఆ, ఆనన్దః = ఆనందము. (భవతి = అగుచున్నది) శ్రోత్రియః = శ్రోత్రియుడును ( వే దా ధ్య య న ము చే సి న వాడును) అవృజినః = పాపము లేనివాడును, అకామహతః = కామహతుడు కానివాడునగు జనుడు, (ఆశలేని జనుడు) యః = ఎవడో (సః = వాడు ఆ జానదేవతలతో సమానమైన ఆనందముగల వాడగుచున్నాడు)

కర్మదేవతల యొక్క నూటింతల యానందము ఆ జాన దేవతల యానందమగుచున్నది. ఆ జాన దేవతలనగా పుట్టుకతోనే దేవత్వముగల వారు, వారియానందము యెట్టిదో, అట్టి ఆనందము శ్రోత్రియుని ఆనంద

మగుచున్నది. శ్రోత్రియుడనగా, సంపూర్ణాచారముతోగూడ వేదాధ్యయనముచేసినవాడును, పాపరహితుడును కామరహితుడును అగును.

ఉ॥ యేశతమాజాన దేవానా మానన్దాః స ఏకః

ప్రజాపతిలోక ఆనన్దో యశ్చశ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథ

టీ॥ అథ = అనన్తరము, ఆ జానదేవానాం = ఆ జానదేవతలయొక్క, శతం = నూఱింతలయిన, ఆనందాః = ఆనందములు, ఏ = ఏవియో, (తే = అవి) ఏకః = ఒక్కటియగు, సః = ఆ, ప్రజాపతిలోక ఆనన్దః = ప్రజాపతిలోక = ప్రజాపతిలోకముయొక్క, ఆనందః=ఆనందము (భవతి = అగుచున్నది, శ్రోత్రియః = శ్రోత్రియుడును, అవృజినః = పాపములేనివాడును, అకామహతః = కామహతుడు కానివాడును, నగుజనుడు (ఆశలేనివాడు నగుజనుడు) యః = ఎవరో (సః = వాడు — ప్రజాపతితో సమానమైన ఆనందముగలవాడగుచున్నాడు.) ఆజానదేవతలయొక్క నూరు ఆనందములు ప్రజాపతియొక్క ఆనందమగుచున్నది. ఈలాగున శ్రోత్రియునియొక్క ఆనందము ఉపమానముగానుండును. పై జెప్పిన ఆ జానదేవత సమానఆనందముగల స్థలములోగూడ ఒకశ్రోత్రియుని నిరూపించడమైనది. అతనికిని ఈతనికిని భేదమేమన మొదటిశ్రోత్రియుడు ప్రపంచకోరికలు లేనివాడు. ఇప్పుడు వర్ణింపబడిన శ్రోత్రియుడు దేవలోక ఆనందమునుకూడ కోరనివాడు అనిభావము.

ఉ॥ యేశతం ప్రజాపతి లోక ఆనందాః స ఏకోబ్రహ్మలోక ఆనన్దోయశ్చ

శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథైష ఏవ పరమ ఆనన్దః॥

టీక॥ అథ = అనన్తరము, ప్రజాపతిలోకే = ప్రజాపతిలోకముయొక్క శతం = నూఱింతలయిన, ఆనన్దాః = ఆనందములు, యే = ఏవియో, (తే = అవి), ఏకః =ఒక్కటియైన, సః = ఆ, బ్రహ్మలోక ఆనందః = బ్రహ్మలోక = బ్రహ్మలోకముయొక్క, ఆనందః = ఆనందము భవతి = అగుచున్నది. శ్రోత్రియః = శ్రోత్రియుడును, అవృజినః = పాపములేనివాడును, అకామహతః =కామహతుడు కానివాడునగుజనుడు; యః = ఎవడో, సః = వాడు, హిరణ్యగర్భానందముతో సమానమయిన ఆనందము గలవాడగుచున్నాడు. ఇకమీదట ఆనందము నెన్నుటకు శక్యము కాదు. అథ = అనన్తరము, ఏష ఏవ=ఇదిఅపరిమితమైన, అవర్ణనీయమైన

ఆనందమే, పరమః = శ్రేష్ఠమాయిన, ఆనందః= ఆనందము, ఇచ్చటచెప్ప బడిన శ్రోత్రియుడు విరాట్పురుషుని ఆనందమునుగూడ కోరనివాడని గ్రహించవలయును. ఇట్లు యాజ్ఞవల్క్యుడు జనకుని గుఱించి చెప్పెను.

శంకరభాష్యమ్ = అతఃపరంగణిత నివృత్తిః ఏష పరమ ఆనన్ద ఇత్యుక్తః యస్యచ పరమానన్దస్య బ్రహ్మాలోకాద్యానన్దా మాత్రాః ఉదధేరివ విప్రుషః॥

ఇకమీదట లెక్కింప శక్యముకాదు. ఇట్టి గణనాతీతమగు ఆనందమే పరమానందము, అనగాపరబ్రహ్మానందము. అట్టిపరమానంద సాగరమున బ్రహ్మాలోకాద్యానందములు నీటి బిందువులవలె లేశములు మాత్రమే. అదియే మహాత్ములగు వారి పరబ్రహ్మానందము.

ఉ॥ సలిలఏకో ద్రష్టాఽద్వైతో భవత్యేష బ్రహ్మాలోకః
సమ్రాడితి హైన మనుశశాస యాజ్ఞవల్క్య ఏషాస్యపరమాగతి
రేషాస్యపరమాసమ్పదేఽస్య పరమోలోక ఏషోఽస్యపరమ
ఆనన్ద ఏతస్యైవానన్ద స్యాన్యాన్ని భూతాని మాత్రాముపజీవన్తి॥

టీక॥ సలిలే=ఉదకమునందు (సలిలమివ = ఉదకమువలెనె, స్వచ్ఛమైన ఉదకము ఉదకమునందువలెనె, సుషుప్తియందు, ఏకః = రెండవది, ద్రష్టా = ద్రష్టయగుఆత్మ, అద్వైతః = చూడదగిన రెండవ వస్తువు లేనిది. భవతి = అగుచున్నది. హే సమ్రాట్ = జనక మహారాజా! ఏషః = ఈఆత్మ, బ్రహ్మాలోకః =బ్రహ్మస్వరూపమాత్రమైనలోకము, ఇతిహ = ఈప్రకారముగానే, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యఋషి, ఏనం = ఈజనకమహారాజునుగూర్చి, అనుశశాస = అనుసరించి శిక్షించెను. (బోధించెను.) అస్య = ఈవిజ్ఞానమయాత్మకు, ఏషా = ఇది పరమా = శ్రేష్ఠమైన గతిః = పొందదగిన స్థానము, ఏషా = ఇది, అస్య = ఈ విజ్ఞానమయాత్మకు, పరమా = శ్రేష్ఠమైన, సమ్పత్ = సమృత్తు (ధనము) ఏషః = ఇది, అస్య =ఈవిజ్ఞానమయాత్మకు, పరమః= శ్రేష్ఠమైన, లోకః =లోకము; ఏషః = ఇది, అస్య = ఈవిజ్ఞానయాత్మకు పరమః = శ్రేష్ఠమైన, ఆనన్దః = ఆనందము, అన్యాని=ఇతరములయిన భూతాని = భూతములు, ఏతస్యైవానన్దస్య=ఈఆనందముయొక్కయే, మాత్రాం = కళను, (అంశమును) ఉపజీవన్తి = అనుసరించి జీవించు

వి. ఇచ్చట యే పరమానందప్రాప్తి తెలుపబడినదో, దానినే
తంజలి మహార్షియు నిర్వికల్పసమాధి యని నిరూపించెను.

సూ॥ ప్రసంఖ్యానే ప్యకుసీదస్య సర్వదా వివేకఖ్యాతి ర్ధర్మమేఘ
స్సమాధిః॥

టీక॥ ప్రసంఖ్యానే, అపి = ఆ వివేకజ్ఞానమందు సయితము,
దస్య = లాభమపేక్షింపనివానికి, సర్వదా = నిరన్తరముగ, వివేక
తేః = వివేకజ్ఞానముండుటనుగాన, ధర్మమేఘః = ధర్మమేఘమనెడు,
ధిః = సమాధియబ్బును.

వి॥ ఇట్టి సమాధియను బ్రహ్మానిలయమును పొందినవారు
యొక లాభము నుద్దేశింపక, మేఘము ఫలమునుకోరక వర్షించు
జ్ఞానామృత వృష్టిని ప్రపంచములో కురిపించవలయు. మఱియు
నిర్వికల్ప సమాధి స్థితిలోనుండు మహాత్మునకు మేఘము కుంభ
వి చేయునటుల బ్రహ్మానంద వర్షమును కురుపించును.

సూ॥ తతః క్లేశకర్మ నివృత్తిః॥

టీక॥ తతః = ఆ ధర్మమేఘ సమాధివలన, క్లేశకర్మ నివృత్తిః =
ధ క్లేశములయొక్కయు, కర్మలయొక్కయు నివృత్తిగల్గును. అట్టి
కయు జీవించియుండియు ముక్తుడగును.

సూ॥ తదా సర్వావరణమలాపేతస్య జ్ఞానస్యానన్త్యాత్ జ్ఞేయ
మల్పమ్॥

టీక॥ తదా = ఆ ధర్మమేఘ సమాధియిబ్బిన కాలమున, సర్వా
మలాపేతస్య = సర్వ = సకలమగు; ఆవరణమల = చిత్త నిష్ఠక్లేశ
పాపములగు ఆచ్ఛాదనములనుండి, అపేతస్య = తొలగిన, జ్ఞానస్య =
ములకు, ఆనన్త్యాత్ = పరిమితి లేకుండుటవలన, జ్ఞేయం = జ్ఞేయ
బాహ్యవస్తువులన్నియు, అల్పం = పరిచ్ఛిన్నములై అల్పములుగ
ను.

తా॥ క్లేశములు, కర్మలు అను మలములు, చిత్తము నావరించి
ను. జీవన్ముక్తావస్థలో నా క్లేశకర్మములను, మలములు తొలగి
నంతనే, చిత్తమపరిచ్ఛిన్నమైయుండును. గాన, జ్ఞేయములగు
వస్తువులన్నియు, పరిచ్ఛిన్నములై యల్పములుగదోచును.

సూ|| తతః కృతార్థానాం పరిణామక్రమ సమాప్తిర్గుణానామ్||

టీక|| తతః= ఆ ధర్మమేఘసమాధి యుదయించుటవలన, కృతార్థానాం = సమాప్తకర్తవ్యములగు, గుణానాం = గుణములకు, పరిణామక్రమసమాప్తిః =పరిణామక్రమ, ఏక్రమమున కార్యోత్పాదనరూప పరిణామముగలిగెనో యాక్రమమునకు, సమాప్తిః=ముగింపు, గల్గుచున్నది.

తా|| వివేకజ్ఞానముయొక్క పరాకాష్ఠారూపమయిన, ధర్మమేఘసమాధియుదయించినంతటనే, సమాప్తకర్తవ్యములగు (కృతార్థములగు గుణములు మరల నాయోగికి శరీరము నారంభింపజాలవు. ఇచ్చట, జీవుఁడు, సర్వపరిణామములులేనివాఁడై, ముక్తుఁడై, పరిపూర్ణబ్రహ్మత్వమును పొందుచున్నాఁడు. అట్టి జీవన్ముక్తుఁడగు మహనీయాత్మునికి మరల జన్మములేదు. ఏలననగా! జన్మమునకు కారణమగు ప్రకృతిసంపూర్ణముగ నశించిపోయినది. ఈ ధర్మమేఘమును గురించి విద్యారణ్యస్వాములు వేదాన్తపంచదశిలో తెల్పినదిన్ని చూడుడు.

శ్లో|| అనాదా విహసంసారే సంచితాః కర్మకోటయః|
అనేన విలయం యాన్తి శుద్ధో ధర్మో వివర్ధతే||

తా|| అనాదిగా ఈ సంసారమునందు, సంపాదింపబడిన, శుభాశుభ కర్మకోట్లు ఈ నిర్వికల్పసమాధిచే నాశమును పొందుచున్నవి. పరిశుద్ధమైన అవిద్యానివర్తక బ్రహ్మసాక్షాత్కార భూత ధర్మము వృద్ధి పొందుచున్నది.

శ్లో|| ధర్మమేఘ మిమం ప్రాహు స్సమాధిం యోగవిత్తమాః|
వర్షత్యేష యతో ధర్మామృత ధారాస్సహస్రశః||

తా|| బ్రహ్మజ్ఞానులగు మహాత్ములు. యీ నిర్వికల్ప సమాధిని, ధర్మమేఘమునుగా చెప్పుదురు. మేఘము వర్షబిందువులను వర్షించినటుల, ఈ నిర్వికల్ప సమాధి పుణ్యలక్షణములయిన జ్ఞానామృతధారలను సహస్ర సంఖ్యాకములుగా వర్షించుచున్నది. ఇదే విషయమును శ్రీకృష్ణభగవానులు గీతలో చెప్పినది గాంచుడు.

శ్లో|| సుఖమాత్యన్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్|
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః||

తా|| అంతము లేనిదియును, శుద్ధమగు బుద్ధిచేతనే తెలియం

దగినదియు, ఇంద్రియములకు గోచరము కానిదియు, అయిన ఆనన్ద మెద్దిగలదో, అటువంటి బ్రహ్మసుఖము నేకాలమున పొందుచున్నాడో, అప్పుడు అట్టుల తెలిసికొన్న ధ్యానయోగి ధ్యానమందున్నవాడగుచు, తత్త్వస్వరూపమునుండి చలింపనే చలింపడు. ఇచట అట్టి సుఖస్వరూప మగు యాత్మ ఇంద్రియములకు అతీతమనియు, మలినేన్ద్రియములకు గోచరముకాదనియు, శుద్ధమగు బుద్ధిగలవారు తెలిసికొనందగినది అనియు గ్రహించవలయు.

శ్లో॥ యం లబ్ధ్వాచాఽపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖే న గురుణాపి విచాల్యతే॥

తా॥ ఏ ఆత్మసుఖమునుపొంది మఱియొక లాభమును అనగా సుఖమును అంతకంటె అతిశయమైన దానినిగా తలంపడో, ఏ ఆత్మానుభవమందైతే యున్నవాడై గొప్పదుఃఖము తటస్థించినను చలింపడు. బ్రహ్మానందము గలవానికి బ్రహ్మాదిలోకములుగూడ తృణముగా తోచును. అదియే యథార్థమైన ఆత్మానందముగలిగిన దానికి గుర్తు.

శ్లో॥ తంవిద్యాద్దుఃఖ సంయోగవియోగం యోగసంజ్ఞితమ్।
సనిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా॥

తా॥ దుఃఖసంబంధరాహిత్యమైనదానిని యోగమనెడు పేరుగల దానినిగా నెఱుంగ వలయును. అట్టియోగము విషయరహితమగు మనస్సుచెసాధించి పొందవలయునని ప్రానికతో పొందతగినదిగా నుంటున్నది.

ఇచ్చటగూడ సర్వవిధ దుఃఖములనుండి విముక్తినిబడయుటయు నిరతిశయానంద సుఖముగలుగుటయు యోగముయొక్క పర్యవసాన స్థితియని గ్రహించవలయు, ఇదియే కైవల్యం అ. 6. ఆంగిరస ఋషి దీనిని గురించి చెప్పినదానిని చూడుడు.

శ్లో॥ సూర్యఖద్యోతయోర్యద్వన్మేరుసర్షపయోరివ
అన్తరం హిమహద్దృష్టం తథా భిక్షుగృహస్థయోః॥

తా॥ సూర్యప్రకాశమునకున్ను, మిణుగురుపురుగు కాంతికిన్ని, మహామేరు పర్వతమునకున్ను, ఆవగింజకున్ను, ఏంత తారతమ్యము గలదో, విషయసుఖమునకున్ను, ఆత్మసుఖమునకున్ను అంతవ్యత్యాసము గలదు అని గ్రహింప నగును. ఓమ్.



---

ఓం శివమ్.

# శ్రీ నిర్వాణనిలయము.

## ద్వితీయ పటలము.

### నిర్వాణ మార్గము.

దీనియందు పరమ, బ్రహ్మనిర్వాణము పొందేపద్ధతి సంగ్రహాముగ తెలుపబడును. దీనిని తెలిసికొనుటకు 24 తత్త్వములతోకూడిన సాంఖ్య శాస్త్రము చాల యుపయోగపడును. అప్పుడే, ఆత్మానాత్మల తత్త్వము బోధపడును. అట్టి బోధజనించిన వ్యష్టికిబుద్ధి పరముగాను, సమష్టికి అవ్యక్తపరముగానుండు, ఆత్మ, పరాత్మలయొక్క ఏకత్వసిద్ధికలుగును. అదియే యుత్తమజ్ఞానమని శ్రీ కృష్ణమతము.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞ యో ర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ॥

తా॥ ఓ యర్జునా! సమస్త దేహములందుండెడు క్షేత్రజ్ఞుని (ఆత్మను) నన్నుగా (బ్రహ్మమునుగా) నెఱుంగుము. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క జ్ఞానము (తెలిసికొనుట) ఏదిగలదో, అదియే యుత్తమమగు జ్ఞానమని నామతమగును.

ఇది సులభముగా నే ప్రకారము పొందవచ్చునో అది గీత మూడవ అధ్యాయాన్తమున, స్వయముగా భగవంతుడే తెలిపెను.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధేః పరతస్తుసః॥

శ్లో॥ ఏవం బుద్ధేః పరంబుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

తా॥ ఈవిషయమును చెప్పనప్పుడు లేక చింతించుసమయమున మనస్సు యేలాగున ఒక్కొక్క దానిని దాటిపోవుచున్నదో, అట్టి భావనగల్గినమాత్రమే అన్నిటికన్న పరమగు నిర్వాణస్థితిలో నిల్వగల్గును.

దృశ్యముకన్న దేహము సూక్ష్మమయినది. శ్రేష్ఠమైనది. అట్టి దేహముకన్నను ఇంద్రియములుసూక్ష్మములు, శ్రేష్ఠములు. ఇంద్రియముల కన్న మనస్సు సూక్ష్మము శ్రేష్ఠమైనది. మనస్సుకన్నబుద్ధి సూక్ష్మమైనది. శ్రేష్ఠమైనది. బుద్ధికన్నయెవడు శ్రేష్ఠుడో, వానిని ఆత్మయని బ్రహ్మవేత్తలు గ్రహించియున్నారు. ఓ అర్జునా! బుద్ధికన్నను సూక్ష్ముడై అధికుడై యుండు ఆత్మను యెఱింగి అట్టి ఆత్మవల్లనే పరమాత్మ భావనయందు సుస్థిరతగల్గి కామరూపమయినదియు సాధనారహితులచే జయింపప్రయాసమయినదియునగు ప్రకృతియను శత్రువును త్యజింపుము. లేక వధింపుము. అనగా సంకల్పాత్మకమగు మాయను త్రోసివేయుము. ఇట్టి స్థితి గల్గిన మాత్రమే తనశరీరమగు క్షేత్రమున దేవుని ప్రతిష్ఠించినవాడగును. అట్లు కానిచో సుందరమగు దేవాలయమును నిర్మించిప్రతిష్ఠచేయనివానియొక్క ప్రయోజనములేనిస్థితియే మనుష్యజన్మను యెత్తినవానికిగూడగల్గును. ఈ స్థితిగల్గిన మంచిచుక్కానిగలవాడు అపాయములేక సముద్రముయొక్క ఆవల తీరమున చేరునటుల శరీరమగునావలోగల ఆత్మను సంసారసాగరమును దాటించి మోక్షదరిని చేరునటులనుండును. అట్లుకానిచో, చుక్కాని వాడు లేనిపడవ సముద్రములోవిడిచినట్లు గమ్యస్థానమునుచేరక అలలచే కొట్టుకొని మునుగునటుల భవసాగరములో మునుంగుట నిక్కము.

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

తా॥ ఓ యర్జునా! ఈ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది. ఈ శరీర ధర్మమును ఎవడెఱుంగుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని ఆ విషయమును నెఱింగిన మునులుచెప్పుదురు. ఇచట సాక్షాద్భగవంతుడే క్షేత్రజ్ఞుడయి అనగా జీవాత్మయే పరమాత్మయని స్వయముగా తెలిపి నాడు. ఇకవిషయమై ఏల సంశయింపవలయును. ఇట్టి స్థితి పొందతగిన వాని లక్షణము. ద్వితీయాధ్యాయమున స్థితప్రజ్ఞుని లక్షణమున తెలిపి యున్నారు. ఆభాగము చూచుకొనవలయును. దానియొక్క సారమంతయు ఒక శ్లోకమున శ్రీకృష్ణభగవానుడు తెలిపియున్నాడు.

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥

తా॥ మనోగతములగు సమస్తసంకల్పములను ఎప్పుడు ప్రయత్న పూర్వకముగా విడుచుచున్నాడో, అప్పుడు తన ఆత్మచే తన యాత్మ యందే ఆనందించువాడగుచు నిశ్చలజ్ఞానముగలవాడని చెప్పబడు చున్నాడు. ఇట్టి స్థితి కలిగేలాగున యత్నించుకొనవలయును. అదియే జీవుల గమ్యస్థానము. ప్రకృతినుండి విముక్తియనియు తెలియందగినది.

ఈ అధ్యాయాంత్యమువఱకు నీ శ్లోకమునకు సహాయముగా నే తక్కినవన్నియు తెలుపఁబడినవి.

మూడవ అధ్యాయమున అట్టి మహాత్మునియొక్క స్థితి తెలుప బడినది.

శ్లో॥ యస్త్వాత్మ రతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే॥

తా॥ ఏ బ్రహ్మనిష్ఠుడైతే తన యాత్మయందు రమించువాడును, తన యాత్మలోనే తృప్తినిజెందువాడును, తన యాత్మయందే ఆనందించు వాడును అగునో, అట్టి యాత్మారామునకు చేయంతగినది మఱియొకటి మిగిలియుండలేదు.

వి॥ చేయవలసిన యనుష్ఠానాది కార్యములన్నియు, చేసినవానికే అట్టి స్థితిగల్గును. ఎవడైతే కృతకృత్యుడగునో, అనగా తాననుష్ఠించ వలసిన కృత్యముల నన్నిటిని కొఱతలేక అనుష్ఠించునో, వానిపేరే కృత కృత్యుడు. అట్టి కృతకృత్యుడే కృతార్థుడగును. అనగా ముక్తుడగును. ఇదే విషయమును కఠోపనిషత్తున యమధర్మరాజు నాచికేతునకొఱకుప దేశించెను.

శ్లో॥ ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్ పరః॥
మహతః పరమ వ్యక్తమవ్యక్తా త్పురుషః పరః।
పురుషా న్న పరం కిఞ్చిత్ సా కాష్ఠా సా పరాగతిః॥

తా॥ గీతలో చెప్పినవిధముగానే యిచ్చోటను గ్రహించుకొన వలయు. ఇంద్రియార్థములకన్న ఇంద్రియములు సూక్ష్మములు. (శ్రేష్ఠ ములు) అట్టివానికన్న మనస్సు పరమయినది. (సూక్ష్మమయినది) అట్టి మనస్సుకన్న బుద్ధి, శ్రేష్ఠము. (సూక్ష్మము) అట్టి బుద్ధికన్న అన్తఃకరణ

ప్రతిబింబితచిదాత్మ సూక్ష్మము. (శ్రేష్ఠము) అట్టి మహాతత్వముతోకూడిన అవ్యక్తము. మూలప్రకృతి గొప్పది. ఏలననగా, ప్రకృతి ప్రతిబింబించిన బ్రహ్మచైతన్యమునకే జీవుడని వ్యవహరింపబడును. కావున నది యుపాధి గతమైనది. అట్టి యుపాధి రహితమగు, ఆత్మయే, సర్వోత్కృష్టము. శుద్ధము పై చెప్పబడిన అన్నిటికన్నను, పరమైనది. అట్టి శుద్ధాత్మ యగు ముక్తాత్మునికన్న శ్రేష్ఠమగునది మఱియొకటిలేదు. అదియే పరమ కాష్ఠ. కాష్ఠయనగా, నిష్ఠయొక్క పర్యవసానము. అదియే పరాగతి. అనగా సర్వోత్కృష్టమగుగతి అనగా మోక్షమని గ్రహించుకొనవలయును.

శ్లో॥ ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మాన ప్రకాశతే।
దృశ్యతే త్వగ్రయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః॥

తా॥ ఈ ఆత్మ సమస్త భూతములలోను గూఢముగానుండుటచే అందఱికిని గోచరించుటలేదు. అట్లున్నను అనుష్ఠానముగలిగి యెవరి బుద్ధి ఏకాగ్రతగల్గిశుద్ధమై సూక్ష్మమైనిర్విషయముగలదై యుంటున్నదో, అట్టి సూక్ష్మదర్శులగు ఋషులవంటి వారివలన దర్శించుటకు యోగ్య మైనది. అట్టి యాత్మ యేప్రకారము గూఢమో అదియిచట తెల్పబడు చున్నది. గూఢమని గోప్యమని గుహ్యమని సూక్ష్మమని రహస్యమని చెప్పుటచే ఎవరున్ను వినతగనిదనిగాని, చూడకూడదనిగాని, తెలిసికొన కూడదనిగాని, తలంచవలదు.

శ్లో॥ తిలేషు తైలం దధినీవ సర్పి రాపస్స్రోతస్స్వరణీషు చాగ్నిః।
ఏవమాత్మని గృహ్యతేఽసౌ సత్యేనైనం తపసా యోఽనుపశ్యతి॥

తా॥ నువ్వులయందు నూనెవలెను, పెరుగునందు వెన్నవలెను, భూగర్భమందు జలధారవలెను, అరణలందు అగ్నివలెను, తనయందీ ఆత్మ నిగూఢమైయున్నది. దానిని సత్యప్రవర్తనచేతను, తపస్సుచేతను, సాధకుడు గాంచగల్గుచున్నాడు. ఆత్మ యీలాగున ఈ దేహములో దేహిరూపముగ నుంటున్నదని తెలుపుటయే గూఢ శబ్దార్థమగును. నువ్వులు గానుగలో ఆడుటచేతను నూనెయు, పెరుగును తరచుటచే వెన్నయు, భూమిని త్రవ్వుటచే జలమున్ను, అరణిని మథించుటచేత అగ్నియు, ఎట్లు ప్రత్యక్షముగా గోచరించుచున్నవో ఆలాగున సత్యతపస్సులు గలవారు పరమాత్మను దర్శింపగలరు. దీనివల్ల దేహమున కన్య

ముగా ఆత్మ యొకటియుండిన ఏలకనిపించుట లేదనియు ఈ జగన్నిర్మాణ కర్తయగు ఈశ్వరుడొకడుండిన ఏల గోచరించుటలేదనియు చెప్పువారికి సరియగు సమాధానము లభించడమగును.

శ్లో॥ నావిరతోదుశ్చరి తాన్నాశాన్తో నాసమాహితః
నాశాన్తమానసోవాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్॥

తా॥ ఎవడయితే దుర్వృత్తినుండివిరమింపని మనస్సుగలవాడై యున్నాడో, ఎవడైతే మనశ్శాంతిగలుగని వాడైయున్నాడో, ఎవడైతే మనస్సమాధానములేనివాడైయున్నాడో, ఎవడైతే మనస్సును సమాధియందు లయింపచేయని వాడైయున్నాడో, అట్టి వానికి యీ ఆత్మ లభించునదిగాదు. మరల యెవరికి లభించును అనగా, దృశ్యవృత్తినుండి విరమించినవానికిని, మనశ్శాంతి గల్గినవానికిని, మనస్సమాధానము సిద్ధించినవానికిని, మనస్సును ధ్యానమందు లయపరచినవానికిని ప్రజ్ఞానమే బ్రహ్మయను తెలిపెడు మహావాక్య విచారణచేత ఈ ఆత్మ పొందబడును. ఇదేరీతిగను శ్రీ వ్యాసమహర్షియు, శాంతిపర్వమందు తెలియపరచిరి.

శ్లో॥ ఇన్ద్రియేభ్యఃపరా హ్యర్థా అర్థేభ్యః పరమం మనః।
మనసస్తు పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః॥
మహతః పరమ వ్యక్తం అవ్యక్తాత్పరతోఽమృతమ్।
అమృతాన్నపరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః॥

తా॥ ఇంద్రియములకన్న అర్థము శ్రేష్ఠము. ఇంద్రియార్థముకన్న మనస్సు శ్రేష్ఠము. మనస్సుకన్న బుద్ధి శ్రేష్ఠము. బుద్ధికన్నను చిదాభాసుడు శ్రేష్ఠుడు. అట్టి చిదాభాసునికన్న మూలప్రకృతి అధికమైనది అట్టిఅవ్యక్తముకన్న అమృతుడగు ఆత్మశ్రేష్ఠుడు అధికమైనవాడు. అట్టి యమృతుడగు అనగా ముక్తుడగు ఆత్మకన్న పరమైనది మఱియేమియు కొంచమైనను లేదు. అదియే పరమకాష్ఠయగును. అదియే సర్వోత్కృష్టమగు గతియు మోక్షమున్ను అగుచున్నది. జలబిందువులు కొన్నిచేరి చిన్నకాలువయై అట్టి ఈ చిన్నకాలువలు కొన్నిచేరి పెద్దకాలువలై అట్టి పెద్దకాలువలు కొన్నిచేరి యుపనదియై అట్టి చిన్న నదులు కొన్నిచేరి గొప్పనదియై అట్టి గొప్పనదులనేకములై సముద్ర

మగునటులు, పై జెప్పిన, ఇంద్రియ, ఇంద్రియార్థములకన్న ఒక్కొక్కటి గొప్పదిగా పరిణమించి కట్టకడపట సాగరమగునటుల దీనిస్థితియు తెలిసికొనవలయును. అయితే జలబిందువులనుండి మహానదియై పరిణమించి సముద్రముచేరువరకు, నెటుల గమనముగలిగియుండునో సముద్రములో చేరినపిమ్మట యేలాగున గమనమాగిపోవునో, కావుననే "సాకాష్ఠాసా పరాగతిః" అని కట్టకడకు తెలుపుటకు కారణము. అలాగున మహాసముద్రమువంటి పరమాత్మనుండి యేర్పడిన జీవరాసులు, క్రమక్రమముగా సాధనలుచేసి ఒక్కొక్క ఆవరణమునుదాటి కట్టకడకు అనంతానందమగు శివమగు అద్వైతమగు అమృతమువఱకు చేరవలయును. అప్పుడు యీ జీవునియొక్క ప్రయాణమున్ను పూర్తియగును.

యోగవాసిష్ఠమున మనుమహర్షి ఇక్ష్వాకుమహారాజునకునుపదేశించినది చూడుడు.

ఇక్ష్వాకు వచనము.

శ్లో॥ అహం కథం చ విషమా దస్మాత్సంసృతివిభ్రమాత్।
విముచ్యేయ ఘనా స్తీర్ణా జ్జాలాదివ విహంగమః॥

తా॥ నేనీ భయంకరమైన సంసారవిభ్రమమునుండి విశాలమైన వలలో చిక్కుకొనిన పక్షివలె యెట్లు విముక్తినొందగలను.

మను వచనము.

శ్లో॥ మనష్షష్ఠేన్ద్రియా తీతం యత్స్యాదపి న కించన।
అవినాశం తదా స్తీహ తత్సదా త్మేతి కథ్యతే॥

తా॥ ఏదిమనస్సుకంటెను తక్కిన పఞ్చేన్ద్రియముల కంటెను అతీతమై యున్నదో, యేది ఇంద్రియములచే నూహింపనలవికానిదో, ఏది నాశరహితమైనదో, అదిమాత్రమె యిటగలదు. అదియే సద్రూపమగు ఆత్మయని చెప్పబడు చున్నది.

శ్లో॥ పదార్థమాత్రం దేహాదిధియా సంత్యజ్య దూరతః।
ఆశీతలా న్తః కరణో నిత్యమాత్మమయో భవ॥

ఓ రాజా! పదార్థమాత్రమగు దేహాదులనుబుద్ధిచే దూరముగత్యజించి పూర్ణశీతలా న్తః కరణుడవై నిత్యము ఆత్మమయుడవుకమ్ము.

శ్లో॥ దేహోఽహ మితి యా బుద్ధిః సా సంసారనిబన్ధనీ।
న కదాచి దియం బుద్ధి రాదేయా హి ముముక్షుభిః॥

తా॥ నేను దేహము అను యీబుద్ధిసంసారమున బన్ధించునదై యున్నది. కావున ముముక్షువులెన్నటికి నట్టి బుద్ధిని గ్రహింపగూడదు. ఆత్మస్వరూపమును మరుపున్ను కలుగజేయకూడదు. ఇదియే జీవన్ముక్తి యగును.

శ్లో॥ న కిఞ్చిన్మాత్ర చిన్మాత్రరూపోఽస్మి గగనా దణుః।
ఇతి యా శాశ్వతీ బుద్ధి స్సా న సంసారబన్ధనీ॥

తా॥ నేను అన్యమెద్దియునుగాను. ఆకాశముకంటెను, సూక్ష్మమైన చిన్మాత్రుడను. అను నిరన్తర ఆత్మబుద్ధి, సంసారమున బంధింపనిదై ము క్తిదాయకమైయున్నది.

శ్లో॥ అనాత్మ న్యాత్మతా మస్మి న్దేహాదా దృశ్యజాలకే।
త్యక్త్వా స త్త్వ ముపారూఢో గూఢ స్తిష్ఠ యథాసుఖమ్॥

తా॥ అనాత్మరూపమగు దేహాదిదృశ్య సమూహమున నాత్మబుద్ధినివదలి నిర్వాసనాభావమున, ఆరూఢుడవై గూఢరూపమున సుఖపూర్వకముగనుండుము.

శ్లో॥ స్వయ మస్య తథా శ క్తి రుదేత్యా బధ్యతే యయా।
స్వయ మస్య తథా శ క్తి రుదేత్యు న్ముచ్యతే యయా॥

తా॥ దేనిచే జీవుడు బంధింపబడునో, అట్టి శ క్తివానియందు స్వయముగ అవిద్యచే యుదయించుచున్నది. మఱియు, దేనిచే నాతడు ముక్తుడగునో, అట్టిశ క్తియువానియందు స్వయముగావిద్యచే (జ్ఞానముచే) నావిర్భవించుచున్నది.

వి॥ చీకటిచే వస్తువు కనపడకపోవుటయు ప్రకాశముచే కనుపించుటయు, ఎటులలోకములో స్వయముగనున్నదో విద్యావిద్యల స్థితి యాలాగుననుండును.

శ్లో॥ చిదాదర్శమయం సర్వం జగదిత్యేవ భావయన్।
య స్తిష్ఠత్యుప శా న్తేచ్ఛం స బ్రహ్మైకవచ స్స్మృతః॥

తా॥ ఈ జగ త్తంతయు చిదాదర్శమయమని భావింపుచు నెవడు కోర్కెలు నశించినవాడై యుండునో, అట్టివాడు అజ్ఞాన బాణములచే

ద్వితీయ పటలము.

భేదింప నలవికాని బ్రహ్మమే వజ్రకవచముగ గల్గియుండునుగాన, నాతడే శాశ్వతసుఖయగును.

శ్లో॥ ఇదం రమ్యమిదం నేతి బీజం తే దుఃఖస న్తతేః।
తస్మి న్సామ్యాగ్నినా దగ్ధే దుఃఖస్యావసరః కుతః॥

తా॥ ఇదిరమ్యము. ఇది అరమ్యము అను నీప్రకారమగు ద్వంద్వ కల్పనయే నీయొక్క దుఃఖసమూహమునకు బీజమైయున్నది. సమత్వ మనునగ్నిచే ఆ బీజము దహింపబడగా నిక దుఃఖమునకు చోటెచట?

శ్లో॥ రాజన్న భావనా స్త్రేణ రమ్యారమ్య విభాగితా।
పౌరుషాతిశయేనాశు స్వేనైవా న్త ర్విలూయతామ్॥

తా॥ ఓ రాజా! సమాధియొక్క యభ్యాసమువలన సర్వదృశ్య విలయమను న స్త్రముచే మహాపురుష ప్రయత్నముద్వారా రమ్యా రమ్య కల్పనను శీఘ్రముగానీయ న్తః కరణమున ఛేదించుము.

శ్లో॥ అభావనేన భావనం విలూయకర్మకాననమ్
పరం సమేత్యతానవం విశోక ఏవ తిష్ఠ భోః॥

తా॥ పుత్రకా! అభావనచే (సర్వదృశ్య విలయముచే) భావనను (దృశ్యస్మరణమును) కర్మయను యరణ్యమును ఛేదించి అతిసూక్ష్మ మగు బ్రహ్మమునుపొంది దుఃఖరహితుడవై యుండుము.

శ్లో॥ భరిత భువనా భోగో భూత్వా విభాగ బహిష్కృతో
గలితకలనా భాసోల్లాసో వివేక విలాసవాక్
అధిగత పరమానన్ద స్స్వన్ద శ్చిరాయ నిరామయః
శమసమసిత స్వచ్ఛాభోగో భవాభయ చిద్వపుః॥

తా॥ పుత్రా! నీవు మొట్టమొదట వివేకమను విలాసముతో గూడియుండి పిమ్మట సమాధిచే నశించిన బాహ్యకల్పనాభాసముగల వాడవై, పూర్ణాత్మచే జగమంతట వ్యాపించిన శరీరముగల్గి విభాగరహితుడవై, పరమానందమునుబొంది శాశ్వతముగ సంసారరోగవర్జితుడవై, శాంతమై, సమమై, ఏకరసమై, స్వచ్ఛమయినట్టి చిన్మాత్రదేహంబుగల వాడవై, సంసారభయరహితుడవై యుండుము. ఇక యాత్మయొక్క యథార్థస్వరూపమును కేనోపనిషత్తున తెలిపిన విధమును చూడుడు. ఈసత్యము తెలిసికొనిన ధ్యానకాలములో మనస్సును ఎచ్చట నిలుప

వలయును. ఎచ్చటనిలిపిన నిశ్చలత్వము గలుగును. నిర్మలత్వము సిద్ధించును. నిరతిశయసుఖములభించును. అను విషయములన్నియు దీనివలన గోచరములగును.

శ్రు॥ శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో
యద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః
చక్షుషశ్చక్షు రతిముచ ధీరాః
ప్రేత్యా స్మాల్లోకా దమృతా భవన్తి॥

టీక॥ యత్ = ఏ కారణమువలన, శ్రోత్రస్య = శ్రోత్రేంద్రియమునకు, శ్రోత్రం = శ్రోత్రముగాను, యస్మాత్ = ఏ కారణమువలన, మనసః = మనస్సునకు, మనః = మనస్సుగాను, వాచః = వాగింద్రియమునకు, వాచం = వాక్కుగాను, ప్రాణస్య = ప్రాణమునకు, ప్రాణః = ప్రాణముగాను, చక్షుషః = నేత్రమునకు, చక్షుః = నేత్రముగాను, ధీరాః = వివేకధీరులు, అతిముచ్య = శ్రోత్రేంద్రియాదులందిదివరకు, తమ యవివేకముచే నుంచబడియున్న ఆత్మభావమునువిడిచి, అస్మాత్ లోకాత్ = ఈ లోకమునుండి, ప్రేత్య=విడువబడి, అమృతాః =మరణము లేనివారుగ, భవన్తి = అగుచున్నారు.

శ్రుతి॥ న తత్ర చక్షు ర్గచ్ఛతి న వా గ్గచ్ఛతి నోమనః।
న విద్మః న విజానీమో యథైత దనుశిష్యాత్॥

టీక॥ తత్ర = ఆ పరబ్రహ్మమందు, చక్షుః = నేత్రము, నగచ్ఛతి= వెళ్లదు, వాక్ = వాక్కు, న గచ్ఛతి = వెళ్లదు, మనః = మనస్సు, నోగచ్ఛతి = వెళ్లదు, అతః = ఈ కారణమువలన, నవిద్మః = తెలిసికొనజాలము, నవిజానీమః = తెలిసికొనలేము, (తర్హి)= అయితే, ఏతత్ = ఈ బ్రహ్మము, యథా = ఏ విధముగా, అనుశిష్యాత్ = (గురువుగాని, శాస్త్రముగాని, శిష్యునికి తెలియజేసినదో (ఆ విధమును తెలియలేకయున్నాము.) ఇది శిష్యవచనము.

గురువాక్యము.

శ్రుతి॥ యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥

టీక॥ యత్ = ఏ బ్రహ్మస్వరూపము, వాచా = వాక్కుచే, అన భ్యుదితమ్ = ప్రకాశింపబడదో, యేన = ఏ స్వయం ప్రకాశ స్వరూపమగు బ్రహ్మముచే, వాక్ = వాగింద్రియము, అభ్యుద్యతే = ప్రకాశింపజేయ బడునో, తదేవ = అదియే, బ్రహ్మ = బ్రహ్మమని, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము, యత్ = ఏ వస్తువు, ఇదమ్ ఇతి = ఈ బ్రహ్మమని, ఉపాసతే = ఉపాసించుచున్నాడో, తత్ = అది, ఇదమ్ = ఈ బ్రహ్మము, న = కాదు.

తా॥ సర్వేన్ద్రియములకుసాక్షియై సర్వేన్ద్రియములను యేచైత న్యము ప్రకాశింపజేయుచున్నదో అదియే బ్రహ్మముకాని నామ, రూప, ఉపాధులతోగూడిన యేవస్తువున్ను బ్రహ్మముకాదనిభావము, కావుననే మహావాక్యములలో మొట్టమొదట "ప్రజ్ఞానం బ్రహ్మ" అని యుప దేశించుటకు కారణమైనది.

శ్రుతి॥ యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥

టీక॥ యత్ = యే బ్రహ్మస్వరూపమును, చక్షుషా = నేత్రముచే నపశ్యతి = చూడబడదో, యేన= యేబ్రహ్మముచే, చక్షూంషి= నేత్రే న్ద్రియములును, పశ్యతి = చూచునో, తత్, ఏవ = అదియే బ్రహ్మ = బ్రహ్మమని, త్వం =నీవు, విద్ధి = తెలిసికొనుము, యత్ = ఏవస్తువును ఇదమ్ = ఈ బ్రహ్మమని, ఉపాసతే =ఉపాసనచేయుచున్నారో, తత్= అది, ఇదం = ఈ బ్రహ్మస్వరూపము, న = కాదు, ఇదియు పైజెప్పిన విధముగా ప్రజ్ఞానమే బ్రహ్మమని నిరూపణజేయుచున్నది.

శ్రుతి॥ యచ్ఛ్రోత్రేణ న శృణోతి, యేనశ్రోత మిదం శ్రుతమ్।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥

టీక॥ యత్ = ఏబ్రహ్మము, శ్రోత్రేణ = శ్రోత్రేన్ద్రియముచేత న శృణోతి = వినుటకలవికాదో, యేన = ఏవస్తువుచేత, ఇదం, శ్రోత్రం= ఈ శ్రోత్రేన్ద్రియము, శ్రుతమ్ = వినుచున్నదో, తదేవ = అదియే, బ్రహ్మ = బ్రహ్మమని, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము యత్ = ఏవస్తువును, ఇదం = ఈ బ్రహ్మమని, ఉపాసతే=ఉపాసించుచున్నారో, తత్ = ఆ బ్రహ్మము, ఇదమ్ = ఈ బ్రహ్మము, న = కాదు.

ఇదియు ప్రజ్ఞానస్వరూపమే బ్రహ్మముగా వర్ణించుచున్నది.

శ్రుతి॥ యత్ప్రాణేన నప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥

టీక॥ యత్ = ఏబ్రహ్మము, ప్రాణేన = ప్రాణవాయువుచే, నప్రాణితి = గ్రహింపజాలదో, యేన = ఏబ్రహ్మముచే, ప్రాణః = ప్రాణము, ప్రణీయతే = చేష్టగలదిగానగుచున్నదో, తదేవ = అదియే, బ్రహ్మ = బ్రహ్మమని, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము. యత్ = ఏవస్తువును, ఇదమ్ = ఈనిర్గుణ నిరవయవబ్రహ్మముగా, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తత్ = అవస్తువు, ఇదమ్ = ఈనిర్గుణబ్రహ్మము, న = కాదు.

ఇచ్చటను, ప్రజ్ఞానమే బ్రహ్మముకాని తదితరవస్తువులు బ్రహ్మము కావని తెలుపబడమైనది.

ఇపుడు దీనియందు వ్రాసివచ్చిన వాక్యములనన్నిటిని ఏకాగ్రతతో విచారణచేసిన ఆత్మవస్తువు ఏదియో, బ్రహ్మమెట్టిదో, నిర్వికల్ప సమాధిస్థితి యెట్టిదో, నిర్వాణస్థితి ఏలాగున నుండునో, యివియన్నియు సూక్ష్మబుద్ధిగలవారికిని అన్తఃకరణ శుద్ధిగలవారికిని గోచరించును.

ఓమ్ తత్ సత్.

---

ఓమ్.

# ఆహార నియమము.

సాధకుని సాధనావిషయములలో ఆహార నియమముకూడ ఒక ప్రధాన యంగమని జ్ఞాపకములో నుంచవలయును. అయినచో, తనఆహారముచే ఇతరులకు బాధకలుగచేయనిదియు, తన యనుష్ఠానమునకు భంగకరము కానిదియు, నైయుండవలయును. అదియును సామాన్యముగాను, అంతట దొరకువస్తువుగాను, సాధ్యమయినంత తక్కువ వెలకు లభించెడు వస్తువుగాను, యుండవలయును. అప్పుడే అన్ని చోట్ల యుండువారికిని బీదవారికిని అనుష్ఠానములో ప్రవేశించుట కనుకూలముండును. కడుపుయెక్కువ నిండిన సమయముననుఆకలితో నిండా తపించు సమ

యమునను సాధనకనుకూలముండును. ఈ రెండింటియొక్క మధ్యస్థితిలో నుండులాగున సాధకుడు ఎల్లప్పుడును దృష్టినుంచి ప్రవర్తించవలయు. ఈవిషయమై శ్రీకృష్ణభగవానుడుపదేశించినది చూడుడు.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తినచైకాన్త మనశ్నతః।
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥

తా॥ ఓ యర్జునా! అధికముగా భోజనముచేయువానికిని బొత్తిగా భుజింపనివానికిని అధికముగా నిద్రించువానికిని బొత్తిగానిద్రింపని వానికిని యోగము సిద్ధింపదు.

ఇతరయోగశాస్త్రములలో చెప్పిన దానినికూడ గాంచుడు.

శ్లో॥ ద్వౌభాగౌ పూరయేదన్నై స్తోయేనైకం ప్రపూరయేత్।
మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయేత్॥

తా॥ ముముక్షువులందఱు ఉదరమును సగముభాగము అన్నముచేతను, పాతికభాగము జలముచేతను, పాతికభాగము గాలి సంచారార్థముగా నుంచువారు నిరంకుశ బ్రహ్మనిష్ఠయందు సర్వదాయుండవచ్చును. వీరికి నేవ్యాధియు సంభవించదు.

శ్లో॥ ఆత్మసమ్మిత మాహార మాహరే దాత్మవాన్యతిః।
అత్యన్తక్షుధితస్యాపి సమాధి ర్నైవ జాయతే॥

తా॥ ఆత్మనిష్ఠయందు ప్రయత్నముగలవాడు. తనఆత్మకు ఎంతవరకు తృప్తియనితోచునో, అంతవరకే భోజనము చేయవలయును. మిక్కిలి ఆకలితోకూడిన వానికిని మిక్కుటముగా భుజించిన వానికిని ధ్యానమందు సమాధిసిద్ధి సిద్ధించదు.

శ్లో॥ మితాశనో భవే న్నిత్యం భిక్షు ర్మోక్ష పరాయణః।
కామక్రోధాదయో దోషా న భవన్తి మితాశనాత్॥

తా॥ మోక్షాసక్తిగల నరుడు నిత్యమును, మితాన్నపానాదులను భుజించు స్వభావముగలిగి యుండవలయును. ఆలాగున మితాశన స్వభావము గలవానికి, కామ, క్రోధ, లోభ, మోహాది, దోషములు గలుగవు.

శ్లో॥ హితం మితం సదాఽశ్నీయాద్యత్సుఖే నైవ జీర్యతే।
ధాతుః ప్రకుప్యతే యేన త దన్నం వర్జయే ద్యతిః॥

తా॥ ఆహారము మితముగాను, శుద్ధమయినదిగాను, ప్రీతికర మయినదిగాను ఎల్లప్పుడును యుండవలయును. ఏ ఆహారము భుజించిన సుఖముగాను, త్వరితముగాను, జీర్ణమగునో, అట్టి ఆహారమునే భుజించవలయును. ఏ ఆహారము భుజించిన ధాతుప్రకోపముగల్గునో, అట్టి అన్నమునుగాని, ఇతరపదార్థములనుగాని, బ్రహ్మనిష్ఠుడెకప్పుడును భుజింపకూడదు.

"యదుహవా ఆత్మ సమ్మితమన్నంతదవతి తన్నహినస్తి
యద్భూయో హినస్తి తద్యత్కనీయో న తదవతి"

తా॥ ఎంత అన్నము దేహమునకు చాలునో, అంత అన్నము తన్ను కాపాడును. దానికన్న అధికముగా తినుఅన్నము దేహమునకు కీడు గలుగజేయును, దానికన్న తక్కువయగు యన్నము దేహమును సంరక్షించుటలేదు, అని శతపథ బ్రాహ్మణము.

వి॥ తనశరీరమునకు, మితమగు అన్నము, అమృతమువలె తన, దేహమును సంరక్షించును. అమితముగా తినినయన్నమువిషమై పరిణమించి శరీరమును శిక్షించును. తనకుచాలని అన్నమైనా దేహసంరక్షణను సరియగాచేయజాలదు. బుద్ధిమంతుడీ మూడు విషయములను గ్రహించి భోజనము చేయవలయును. అన్నమని చెప్పుటచే బియ్యపు అన్నము, గోధుమ రొట్టె, అనిగ్రహించిన చాలదు. "అద భక్షణే"అను ధాతువునుండి అన్నశబ్దమేర్పడినది. కనుక భక్షించునదంతయు అన్నమనియే తలంచవలయును. అపక్వాహారములుగాని స్వయంప్రకృతి సిద్ధ ఫలమూలాదులుగాని, క్షీరాదులుగాని ఇవన్నియు అన్నశబ్దములో చేరిన వేయగును. అయితే, ఈ స్థూలమయిన సాత్వికాన్నములతో మాత్రము తానుశుద్ధాన్నమును భుజించుచున్నానని తలంచి గర్వించకూడదు. ఈ స్థూలాన్నము స్థూలదేహములకు మాత్రమే సంబంధించియుండును. అవతల, సూక్ష్మదేహమొక్కటిగలదు. దానికిసూక్ష్మాన్నముండవలయు. అది సత్య, శాంత, కరుణ, విరక్తి, దైవభావన, మొదలగునవేయగును. ఇవిలేనిచో, సాత్వికఅన్నముచే గొప్పప్రయోజనమేమియుగలుగదు. ఈ స్థూలదేహమును ఈ సూక్ష్మదేహమే నడుపుచుండును. కావున ఇది చాలాబలవత్తరముగా నుండవలయును. దీనితోను తృప్తిపడకూడదు.

ఇకదీనిపై కారణదేహమొకటిగలదు. అది సూక్ష్మదేహ పోషణకరమగు సత్యశాంత తపస్సులచే శుద్ధముగాదు. అది జ్ఞానముచేతనే శుద్ధముగాను, బలవత్తరముగాను ఏర్పడవలయు. ఈ స్థూల సూక్ష్మశరీరముల రెంటికిని అదియే కారణమగుటచే దానికి కారణదేహమను పేరుగలిగెను. అది దైవజ్ఞానముచే, ఆత్మజ్ఞానముచే బ్రహ్మనిష్ఠచే శుద్ధముగావలయును. ఈ సూక్ష్మకారణదేహములను శుద్ధపరచుటకు తెలియకపోవుటచేతనే స్థూలమైనసాత్త్వికాహారమును భుజించువారలలో చాలమందికి ఆత్మజ్ఞానము, దయ, విరక్తి, కలుగకపోవుటకు కారణము. కావుననే, హింసావర్జితాహారముచే జ్ఞానముగలుగునది నిజమైనచో, హింసారహితమగు ఆహారమును భుజించు వారందఱున్ను జ్ఞానులై యుండవలయునుగదా! అను ప్రశ్నలకు కారణమగుచున్నది. మఱియు, ఈ సాత్త్వికాహారవిషయమై ఒకసూక్ష్మమగు రహస్యముగలదు. వస్తువుమాత్రము శుద్ధముగానుండిన చాలదు. అదివచ్చు మార్గముగూడ శుద్ధముగా నుండవలయు. అసత్య, అన్యాయ, అధర్మమార్గములతోవచ్చిన సాత్త్వికవస్తువులయినను లేక, అసత్య అధర్మ అన్యాయములతో వచ్చినడబ్బుచే కొనెడువస్తువులు శుద్ధములయినను అది అశుద్ధము, పాపము అనికూడబుద్ధిమంతులు తెలిసికొనవలయును. ప్రతిశబ్దమునకున్ను, స్థూలమనియు సూక్ష్మమనియు, బాహ్యమనియు, ఆంతరమనియు రెండర్థములుగలవు. కావున ప్రజ్ఞావంతులు ఈ రెండర్థములను జ్ఞాపకములోనుంచి అన్నికార్యముల చేయవలయును. స్థూలదృష్టి గలవారికి స్థూలార్థమే గోచరించును. సూక్ష్మదృష్టిగలవారికి మాత్రమే సూక్ష్మార్థము గోచరించును. సన్న్యాసమునకున్ను, ఈ స్థూలసూక్ష్మ అర్థముల గ్రహించుకొనవలయును. ఇది యుత్తరగీతలో తెలుపడమైనది. స్థూలదేహ సన్న్యాసము అనగా దేహసన్న్యాసము. దేహసంబంధ సన్న్యాసముచే తృప్తినిఁబొందకూడదు. సంకల్ప సన్న్యాసము, అనగా మానసిక సన్న్యాసము గల్గియుండవలయు. దీనివల్లను, కృతార్థుడయితినని తలంచవలదు. కారణదేహ సన్న్యాసము గూడచేయవలయు. అనగా అవిద్యారాహిత్యమును చేయవలయును. అది అనాత్మ దేహేంద్రియాదులలో ఆత్మ భావనగలుగచేయుచుండును. దానికే కారణదేహమనియు, మూలావిద్యయనియు, ప్రకృతియనియు,

